ఆంధ్రపారిజాత ప్రచురణములు.

2 వ ప్రచురణము.

# అడిదము సూరకవి




[illegible]

తెనుఁగుపండితుఁడు, (కాలేజీడిపార్టుమెంటు)
మహారాజావారికాలేజీ,
విజయనగరము.








విజయనగరము
శ్రీ. శ్రీనివాసరావు వారి
స్వకీయ శ్రీవేదవ్యాసముద్రాక్షరశాల,
1919

చందాదారులకు వెల రు 1-0-0.



ఇతరులకు వెల రు 1-4-0

# సంపాదకీయ భూమిక.

కావ్యకర్తల (Men of Letters.) జీవితచరిత్రముల నానుపూర్వికముగను సవిమర్శనముగను వర్ణించు పుస్తకములాంగ్లమున నెన్నియో కలవు. కవులను వారికవనములకునుగల యన్యోన్యాశ్రయము నవి యెంతసమంజసముగనో విశదపరచును అట్టికావ్యములాంధ్రమున లేకుండుట యొకగొప్ప లోపమని విమర్శకులయభిప్రాయము. ఈ "అడిదముసూరకవి" యను కావ్యము నాంధ్రమున నట్టిగ్రంథముగ వ్రాయించి మాయాంధ్రపారిజాత గ్రంథావళియందు రెండవప్రచురముగ ప్రకటింపసాహసించితిమి.

అడిదము సూరకవినిగూర్చి వంశపారంపర్యముగను, ఈప్రాంతమందు ప్రజలలో సంప్రదాయముగను నిలిచియున్న గాథలను, చాటువులను, ముచ్చటలను, వృత్తాంతములను చేర్చి విమర్శించి యీగ్రంథమును మ॥ రా॥ రా॥ అడిదము రామారావు పంతులుగారు రచించి యాంధ్రుల కృతజ్ఞతకుపాత్రులైనారు. ఆంధ్రకవులనుగూర్చి యిట్టివిపులములగు జీవితచరిత్రములాంధ్రమున లేవనియే చెప్పవచ్చును. ఇది యీవిషయమున ప్రథమప్రయత్నము.

దీనిని చదివినతరువాత సూరకవి యెట్టివాఁడో, అతనిశీలమెట్టిదో, అతని కవనములవల్ల నదియెంతవరకు నూహించఁదగి యున్నదో, సూరకవి పాండిత్యమెట్టిదో అదియతని కవిత్వమునకెట్లు వన్నెతెచ్చినదో, సూరకవి వాగ్ధాటియెట్టిదో, అదియాతని జీవితమునందెట్లుపయోగపడినదో ;—ఇట్టి యంశములనేకములు స్పష్టపడగలవు, జీవితమందలిప్రోత్సాహములననుసరించి కవుల కల్పనావిశేషములు సాగుచుండునను సాహిత్యశాస్త్రసూత్ర మీ సూరకవిపట్ల సిద్ధాంతమగుచున్నదనుటకు సందియములేదు.

ఇట్లు విపులముగ కవిజీవితమును రచించునపుడు కలుగుకష్టములలో ముఖ్యమైనది సమంజసములగు గాథలఁ జేర్చి, తాత్కాలిక ప్రయోజనము గలవాటిని విసర్జించుట. మిత్త్రముపయి నీకష్టమును కృతికర్త నుభవగాఢాపెననియే చెప్పవచ్చును. ఇందలి గాథలన్నియు రసవంతములై వినఁదగినవే యున్నవి.

క్రీస్తుశక ప్రారంభమునకు పూర్వము రెండు మూడువందల సంవత్సరములనుండియు నాంధ్ర కళింగరాజ్యములు తెలుగుప్రజలకు నిలయములై ప్రసిద్ధిగాంచినను, ఆంధ్రరాజ్యమందలి కవితావిజృంభణమే ప్రస్తుతము ప్రచారమందున్న "కవిజీవితముల" వల్ల తెలియుచున్నదిగాని, కళింగ రాజ్యమందలి కవితావిశేషములనుగూర్చి యంతగా తెలియుటలేదు. ఈ "కవిజీవితముల" ను బట్టి కళింగరాజ్యమందలి యాంధ్రకవులలో కావ్యాలంకార చూడామణికర్తయగు విన్నకోట పెద్దిరాజుగారే ప్రథముడైనను శాసనములనుబట్టి నన్నయ రాజమహేంద్రవరమున ప్రబలిననాటికే కళింగ రాజ్యమున నాంధ్రకవిత్వము శాసనములలోనికి గూడ నెక్కినట్లు స్పష్టమగుచున్నది. అయినను కళింగరాజ్యపుఁ గవులలో క్రీ॥ శ॥ 18 వ శతాబ్దమున నుండి కవిత్వమునకు ప్రసిద్ధిగాంచినవాఁడీయడిదము సూరకవి.

క్రీ॥ శ॥ 19 వ శతాబ్దపుఁ బూర్వార్ధమందు మాడుగులసంస్థానమున శ్రీకృష్ణభూపతిదేవు మహారాజులుంగారి యాస్థానకవియగు మంత్రిప్రగడ సూర్యప్రకాశకవి తనకృష్ణార్జునచరిత్రమున నీయడిదము సూరకవిని—

క. అడిదము వంశాంబుధిరా
డుడుపతియన ధరణివెలసి ♦ యుర్వీశులచేఁ
గడుమన్ననఁగొని యెన్నం
బడు సూరకవీంద్రుఁదలఁతుఁ ♦ బటుగుణసాంద్రున్.

అని స్తుతించి యున్నాఁడు ఈ స్తుతికనుగుణముగనే యిటీవలి సాహిత్య విమర్శకులు సూరకవి రచనలనుగూర్చి ప్రశంసించిరి.

ఈ 'సూరకవి జీవిత' మందలి యూహలనుగూర్చి యభిప్రాయ భేదములకవకాశము లేకపోలేదు. ఉదాహరణము :— 'అడిదము' అను గృహనామమును గురించినయూహ. శ్రీ రామారావు పంతులుగారి వాక్యములీసందర్భమున సమంజసములే యైనను, కేవలము లోకవాడుకననుసరించి యున్నవి. 'అడిదము' అనునది పౌరుషనామమనుట లోకవాడుక. విమర్శించి చూడఁగా శాసనములం దడిదమునాడను మండలము పూర్వముండినట్లు కనబడుచున్నది. అడిదమను గ్రామమును గలదు. సాధారణముగా దెనుగు బ్రాహ్మణులగృహనామములు గ్రామనామములై యుండుటవలననీయడిదమను నదియు గ్రామనామమే యైయుండును. కాని నీలాద్రికవినాఁడది యూహ

పరాక్రమాతిశయములవలన నన్వర్థనామమైయుండును. గ్రంథవారణమనునది హామగలనోట బడి రూపుమారిన 'గంధవారణ' యనుబిరుదము. ఇది నీలాద్రి కవికి సేనాధిపతిత్వమువలన చెల్లియుండును. ఆతని తరువాతివారు గంధవారణమువారయి యుందురు. అట్లే గోదావరి మండలమందలి మోదుకూరు కాపురమువచ్చిన యడిదమువారికుటుంబము మొదట మోదుకూరి యడిదము వారయి రానురాను మోదుకూరువారయి యుందురు. ఇట్లు గృహనామములు మారుటకెన్నియో నిదర్శనములు కలవు. కాని సూరకవిగారి కుటుంబమువారు మాత్రము నీలాద్రికవిగారి కోవలోనివారే.

సూరకవికి తొమ్మిదవపురుషుడగు నీలాద్రికవినాటినుండి 'ఈ కళింగ భూపతుల' (అనగా విజయనగర పూసపాటి వంశమును) నాశ్రయించిన వారమని సూరకవిచెప్పిన చాటువుతో నీ గ్రంథము ప్రారంభింపబడినది. ఈ నీలాద్రికవి నేలిన పూసపాటిప్రభువు రాచిరాజుగారో (1) ఆతని కుమారుడగు తమ్మిరాజుగారో కావలెను. వీరి ప్రసిద్ధినిగూర్చియు, ప్రతాపమునుగూర్చియు పూసపాటిరాజకవులు రచించిన ప్రబంధములలో నీక్రింది విధమున ప్రశంసలు కలవు.

శ్రీమన్మహామండలేశ్వర శ్రీపూసపాటి రాచిరాజు (1) గారు.

మ. దిననాథద్యుతి రాచిరాజు రణధా ♦ త్రిందామెరాధీశు తి
మ్మననోడించెఁ జళుక్యవీర ఘనరా ♦ జ్యస్థాపనాచార్యతన్
గనియెన్ మ్లేచ్ఛుఁ గెల్చి తద్వివిధ దు ♦ ర్గగ్రాహియై ప్రౌఢదే
వనృపాదిప్రభు భూషణప్రథిత ది ♦ వ్యద్విక్రమప్రౌఢిచేన్.
(విష్ణుభక్తిసుధాకరము)

ఉ. వారలలోన రాచనృప ♦ వర్యుఁడు దామెర తిమ్మభూవరున్
బౌరుషవృత్తిఁ గెల్చి తన ♦ బంటుగఁ జేకొని మ్లేచ్ఛరాజులన్
బోరులగెల్చి దుర్గముల ♦ నుంగొని మాళవరాజు గెల్చి త
త్పౌరుషలబ్ధ మన్యముల ♦ తాన్ బిరుదంబు సహించెనెంతయున్.

ఆ॥ వె॥ ప్రౌఢదేవరాయ ♦ బహుమతుండై మించె
ధర చళుక్యవంశ ♦ వరనృపాలు
రాజ్యలాభమునఁ జై ♦ లంగించుటఁ దడంక
బిరుదనాము మొంది ♦ పేరుగాంచె.

క. నిరతంబు శివపదభక్తుల
పరిపతన మొనర్చి త ♦ త్ప్రభావంబున ను
ద్ధుర వైరిపురము లేర్చెను
హరునికరణి సుమనసుల్ మ ♦ హాశ్చర్యపడన్.

(ఉషాభ్యుదయము).

## శ్రీమన్మహామండలేశ్వర శ్రీపూసపాటి తమ్మిరాజు (౩) గారు.

సీ. వారిలోఁ దమ్మభూ ♦ పతిమౌళి దోర్దండ
తతబలసామగ్రి ♦ దరమె యెన్న
దండిమై బెల్లము ♦ కొండసాధించెను
ప్రౌఢిగెల్చెను రంగ ♦ రాజుకొండ
త్రిభువనరాయాంక ♦ దీపితు రావుసిం
గనను బరాజితి ♦ గానొనర్చె
నని శరణన్న బా ♦ హాతి ఖానును గాచెఁ
బటుశక్తిచే నోడ ♦ పల్లిగొనియె
కఠిన రిపుజాల భయద వి ♦ క్రమము గలిగి
ప్రాజ్యసామ్రాజ్య విభవ పూ ♦ ర్వహత గనియె
నార! యస్మద్వశిష్ఠ గో ♦ త్రావనీశ
కోటికాతండె మేటి కి ♦ రీటివిభుడు.

(విష్ణుభక్తిసుధాకరము.)

మ. అనినం దాపురశైలసన్నిధి గజేం ♦ ద్రానీకమున్ గూల్చి యం
దెనసెన్ శ్రీగజపత్యభిఖ్య గుడశై ♦ లేంద్రుండు శ్రీరంగరా
జనరేంద్రుండల యోడపల్లి విభుఁడున్ ♦ జన్యంబులందోడఁ గై
కొనియెన్ వారలపట్టణంబుల శిరుల్ ♦ ఘోరప్రతాపంబునన్.

గీ. త్రిభువనీ రాయబిరుద ప్ర ♦ దీప్తుడైన
రావుసింగని సంగర ♦ రంగమందు
దునిమెఁ బెదవీటిచెంత స ♦ ద్వినుతుఁడగుచు
కలన శరణన్న బాహాది ♦ ఖానుగాచె.

(ఉషాభ్యుదయము)

ఇందు ముఖ్యముగా "వసిష్టగోత్రపవిత్రకోటికిమేటికిరీటి విభుండు"గా నుతింపబడిన శ్రీతిమ్మిరాజమహామండలేశ్వరుని కొలువునవే సన్మానితుడై పరాక్రమముచూపి యడిదమునీలాద్రికవి 'యడిదము' ను కానుకగా గొనుటయు, 'రణరంగవిజయ' కావ్యమును (తనయేలికవిజయమునుగూర్చి) రచించుటయు జరిగియుండునని నాయూహ. శ్రీమన్మహామండలేశ్వర మహీమండలరాయ మన్నెసుల్తాన్ శ్రీపూసపాటి రాచిరాజయ్యదేవ మహారాజులుంగారి కుమారుడగు శ్రీ తిమ్మిరాజులుంగారు "స్వస్తిశ్రీ జయాభ్యుదయశాలివాహనశకవర్షంబులు వేయిన్నిమున్నూటయనభైయగు నా.........యన్ తమపూర్వస్థానమైన బెజవాడకు తమబంధువులైన సూర్యసోమవంశపు రాజులున్ను తామున్ను వచ్చి అక్కడ యింద్రకీలాద్రియందున పాండవులగుళ్ల దక్షిణభాగమందు కృష్ణవేణీమల్లిఖార్జున నరశింహులు సాక్షిగాను విజయశాసన శిలాస్తంభంబు" వేయించిరి.

అనగా క్రీ॥ శ॥ 1458 సం॥ర ప్రాంతమున నీయడిదము నీలాద్రికవి పూసపాటి భూపతులసన్మానమునకు పాత్రుడైన పోటరియు కవియునై తన యేలికయగు తిమ్మిరాజమహామండలేశ్వరుని విజయములనుగ్గడించుచు "రణరంగవిజయ" కావ్యమును రచించియుండెను. పూసపాటిభూపతుల కృతినందిన నవభారతాది గ్రంథములవలె నీరణరంగవిజయమును నామావశిష్టమైపోయినది. కాని యీ తిమ్మిరాజుగారినిగూర్చి మాత్రము చక్కని పద్యములు కలవు. అందుకొన్నియైనను 'రణరంగవిజయ' ములోనివైయుండవలెను (నూరకవి తనయేలికనుగూర్చిచెప్పిన పద్యములట్లే భట్టుపద్యములైనవి). కాన సుదాహరణమునకై కొన్నియిందు చేర్చబడినవి.

సీ॥ హేమాచలముదాక ♦ యేకచక్రంబుగా
భువినేలె మీతాత ♦ బుద్ధవర్మ
మీతాత గురియించె ♦ మెరసి మాధవవర్మ
గరిమచే బెజవాడ ♦ కనకవృష్టి
పాండ్య కేకయ చోళ ♦ పరవీరనృపతుల
తెగటార్చె మీతాత ♦ దేవవర్మ
పిడుగు ముత్తునియగా ♦ వడినేసె మీతాత
భీకరంబుగ చిక్క ♦ భీమనృపతి

చండ విక్రమ యినవంశ ♦ జలధి చంద్రి
బాపు మగధీర రణరంగ ♦ భైరవాంక
పాసగ నెవ్వరు నీసాటి ♦ పూసపాటి
పగరకనుదిమ్మ రాచభూ ♦ ధవుని తిమ్మ.

మ॥ అతిశౌర్యండగు పూసపాటికుల రా ♦ చాధీశుతమ్మయ్య కు
న్నతి గావింపుచు నాశ్రయించిరిల ప ♦ న్నాటీ పరిచ్ఛేదికా
కితకోట ప్రభులాత్మ బాంధవతనో ♦ గెల్వంగ లేకోమహా
చతురుండంచును ఋద్విపాగ్ని శశభృ ♦ చ్ఛాకాబ్దకాలంబునన్.

ఉ॥ కొందరు రాజులప్పనము ♦ కొమ్మని యియ్యగ బంధు వర్గమై
కొందరుగొల్వ పేరులిడి ♦ కొందరు మొక్కగ నూడిగంబులన్
ముందట కొందరుంబిరుదు ♦ మోవగ రాజుల పూజలింగమై
అందునమించె రాచమను ♦ జాధిపు తమ్మనరాజ మాత్రిడే.

సీ॥ మెండైండ రాజుల ♦ గుండెలో గాలాము
విరసించు రాజుల ♦ వెన్ను తెరటు
కలహించు రాజుల ♦ కడుపులోపల కత్తి
గర్వించు రాజుల ♦ కాలయముడు
మార్కొన్న రాజుల ♦ మత్తేభ సింహంబు
మదవైరి రాజుల ♦ మగల మగడు
కోధించు రాజుల ♦ కొన మీసములమిండ
నిరసించు రాజుల ♦ నెత్తి పిడుగు
సకల సౌజన్య రాజన్య ♦ చక్రవర్తి
రాజుకబలేశ్వరస్వామి ♦ రాజ్యధుర్య
భూసురారామ తరువాటి ♦ పూసపాటి
రాచవిభుతిమ్మవుద్దండ ♦ రాచమాన.

(ఇవి భట్టుపద్యములు. పాఠములు వికృతములైయున్నవి. కాని తిమ్మి రాజు మహామండలేశ్వరునిగూర్చినవనుట స్పష్టము)

ఈ పూసపాటి వంశమువారు కళింగదేశమునకు వచ్చినప్పుడు వీరితో నీప్రాంతమునకు వచ్చిన నియోగి కుటుంబములలో నీయడిదమువారు కవిత్వమునకును మాబురాజువారు రాజకార్య నిర్వాహణదక్షతకును ప్రసిద్ధులు. ఈ

రెండు కుటుంబములకును వాటినుండియు బాంధవ్యము కలదు. వీరిజ్ఞాతులీ కళింగ రాజ్యమునతప్ప నాంధ్రమండలమందితర స్థలములయందంతరించిపోయిరి.

సూరకవి తండ్రియగు బాలభాస్కరుడే సూరకవికి విద్యాగురువనియు, నీ బాలభాస్కరుడు శుద్ధాంధ్రరామాయణమను గ్రంథము దేవాంకితముగ రచించెననియు నీగ్రంథమున చెప్పబడినది. శుద్ధాంధ్ర రామాయణము దొరకలేదుగాని బాలభాస్కర విరచితమగు లక్షణసారమను నొకగ్రంథము దొరికినది. ఒక ప్రతి మ॥ రా॥ రా॥ శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రి B.A. గారి కుటుంబమువారిది. రెండవది మాకాలేజీలో నుపాధ్యాయులుగానుండి కీర్తిశేషులైన కూరెళ్ల చంద్రశేఖరముగారి కుటుంబమువారిది. ఈ ప్రతులు రెండును తెప్పించి చూచితిని. అందు కూరెళ్లవారిప్రతి ముఖ్యమైనది. అది పూనపాటి రేగ కాపురస్థులగు ఓరుగంటి రామన్నగారు వ్రాసుకొనినది. వ్రాత చక్కగానున్నది దానినిబట్టి యీలక్షణసారము శ్రీ రామతీర్థ క్షేత్రమందు వెలసియున్న రామస్వామికంకితముగా రచింపబడినట్లు తెలుచున్నది. ఇది యీనాటిదేయగు రంగరాట్ఛందమువంటిది. అడిదమువారి కుటుంబపు ప్రాచ్యలిఖిత తాళపత్రములందు అనంతుని ఛందస్సు కలదు. ఇది బాలభాస్కరుని లక్షణసారమునకు మార్గదర్శకమై యుండును. బాలభాస్కరుని కవితాశైలికుదాహరణముగ నీలక్షణసారమునుండి కొన్ని పద్యములిందు చేర్చుచున్నాను :—

క. శ్రీమనుకులాబ్ధిసోమా
సామజవరవరద నీల ♦ జలదశ్యామా
కామారి వినుతనామా
శ్రీమందిర రామతీర్థ ♦ సీతారామా.

గీ. రఘువరాయన నగమొప్పు ♦ నఘవిదూర
రఘువరయనంగ నలము పు ♦ రాణ పురుష
నలము రఘువీర యనగ రా ♦ జన్యతిలక
రాక్షసవిరామ రామతీ ♦ ర్థగిరిధామ.

శా. పద్మప్రోద్భవ సన్నిభుల్మసజస ♦ ప్రవ్యక్త తాగంబులన్
పద్మాప్తాంచిత విశ్రమంబుగ సము ♦ త్పాదింతురుద్యన్మతిన్
పద్మాక్షాయనిజాంఘ్రి సంశ్రిత మహా ♦ పద్మాయయోగీంద్రహృ
త్పద్మస్థాయ నమోస్తుతేయనుచు ని ♦ శార్దూలవిక్రీడితల్

ఉ. శ్రీరమణీముఖాంబురుహ ♦ సేవనషట్పద నాభయాంచు శృం
గారరసేశయాంచు ధృత కౌస్తుభయాంచు భరేభనంబులన్
భారలగంబులంగదియ ♦ బల్కుచు నుత్పలమాలికాకృతుల్
గారవమొప్పఁ జెప్పుదురు ♦ కావ్యవిదుల్ యతితొమ్మిదింటరాన్.

గీ. కరుణతోడ మమ్ము ♦ గాచి రక్షించుము
ఝషముఖావతార ♦ జలజనేత్ర
తరణికులలలామ ♦ ధారాధరశ్యామ
దేవదేవ రామ ♦ తీర్థధామ.

ఈ బాలభాస్కరుని కాలముననే శ్రీరామతీర్థక్షేత్రమందు శ్రీరామస్వామి క్రొత్తగా ప్రతిష్ఠింపబడియుండును. ఆకాలమున పూసపాటిరాజవంశపుఁ గవులును వారియాశ్రితులునుగూడ నీరామస్వామికిఁ గృతులిచ్చియుందురు. యుషాభ్యుదయమును విష్ణుభక్తిసుధాకరమును, హోరాలక్షణమును శ్రీరామతీర్థశ్రీరామస్వామి కంకితముగనుండుటవలన నిర్ధరింపబడుచున్నది. ఇట్లే బాలభాస్కరకవి లక్షణసారమును రామతీర్థ శ్రీరామస్వామికి కృతియైనది. ఈ లక్షణమును సమకాలీనమగు రంగరాట్ఛందముతో పోల్చి విమర్శగా చూచితిని. సర్వవిధముల తులతూగుచున్నవి. ఇట్టిలక్షణవేత్తయు, శుద్ధాంధ్రకవియు, రామభక్తుడునునగు తండ్రికడ శుశ్రూషచేసి సంపాదించిన కవనము గనుకనే సూరకవి కవనమంతగా శోభించి యాచంద్రార్కస్థాయియయినది.

సూరకవిసంస్కృతభాషాపాండిత్యమునుగూర్చి కృతికర్త చేసిన యూహాలు సరియేయైనను, సూరకవి తనకవిత్వమునకుపచరించు శాస్త్రములు మాత్రమే శ్రద్ధగా నభ్యసించెననవలసియున్నది.

రెల్లివలసలో పోగామిగిలియున్న యడిదమువారి తాళపత్రగ్రంథములను తెప్పించిచూడగా నందువారభ్యసించిన సంస్కృత వ్యాకరణఫక్కి యొకటి కనబడినది. ఇందాంధ్రసంస్కృతముల తారతమ్యములు చూపుచు గ్రంథము విస్తరించబడినది. ఇట్లాంధ్రగీర్వాణ భాషలను తారతమ్యదృష్టి (Comparative view) నభ్యసించుటవలననే గాబోలు నూరకవి పద్యములయందాంధ్రగీర్వాణభాషా ప్రయోగములంత చక్కగా నొకటికొకటి యమరియున్నవి. నూరకవి యిట్లు వ్యాకరణమేగాక కావ్యశాస్త్రమును, సాముద్రికమును, ఛందోలక్షణమును నేర్చియుండును. ఇందుకు తార్కాణముగా నీశాస్త్ర భాగములు పైనుదాహరించిన రెల్లివలస గ్రంథపత్రములందు కనబడుచున్నవి.

బాలభాస్కరకవి శుద్ధాంధ్ర రామాయణము రచించుటచే వెల్లడించిన శుద్ధాంధ్రప్రీతికితోడు నూరకవి పినతండ్రి రామకవి "శుద్ధాంధ్రకవిని" యని తన యర్జీపద్యమున చెప్పియున్నాడు. ఈ యడిదము కుటుంబములో బాలభాస్కరుని తరువాత మూడవకవియగు బాలభాస్కరకవి (III) స్వీయముగా వ్రాసికొనిన యచ్చతెలుగు పద్యములుగల తాళపత్రమొకటి 'రెల్లివలస తాటాకుల' లోనున్నది. వంశపారంపర్యముగ నీకవులకు శుద్ధాంధ్రమందుగల ప్రీతి నీపద్యములు వెల్లడించును.

వసిష్ఠగోత్రులగు శ్రీపూసపాటి వంశభూపతులవలెనే వసిష్ఠగోత్రులగు నీయడిదము కవులును శివశ్యామలా దైవతోపాసకులు. విశేషించి బాలభాస్కరు (I) ని నాడు రామోపాసనము ప్రారంభించియుందురు. ఇందుకు తార్కాణముగా వారిగ్రంథములలో రామస్తోత్రములేగాక శివస్తోత్రములుకూడగలవు. మొత్తముపైని ప్రథమతః వీరు తమయేలికలవలెనే యద్వైతులని తేలుచున్నది. దీనికిబలముగా "రెల్లివలస తాళపత్రములందు" రామోపాసనా విధానములును,శివాష్టకములును,శ్యామలాదండకములును బాలభాస్కరుడు (III) గారి స్వహస్తలిఖితములు కానవచ్చుచున్నవి.

నూరకవి యేలిక చినవిజయరామమహారాజులుంగారు. వీరుపద్మనాభమందు వీరస్వర్గముగాంచిరి. వీరి పరాక్రమాతిశయములుగ్గడించు "విజయరామమహారాజుచరిత్ర" మనుగ్రంథము నానాటి యాస్థాన కవియగు చాత్రాతి లక్ష్మీనరసుగారి పుత్రులు కనకయ్యగారు రచించిరి. అది శ్రీవిజయ

రామమహారాజులుంగారి పుత్రులగు శ్రీ నారాయణగజపతిమహారాజులుంగారి కంకితము కాబడినట్లు

శ్రీరవివిమల కలశాంబుధి
తారాధిప నవకళింగ ♦ ధరణీపమహా
దారయశః పూసపాటి
నారాయణ గజపతీంద్ర ♦ నరనాథేంద్ర.

యను నాశ్వాసారంభపద్యమువలన తెలియుచున్నది. ఈ కావ్యము లో కొంత భాగమే దొరికినది. అందుండి శ్రీవిజయరామమహారాజులుంగారి పద్మనాభమందలి సమరకటకము (War Camp) నుగూర్చిన ప్రశస్తిపద్యములనిందు బొందుపరచుచున్నాను. వీటివలన నానాటియాస్థానకవుల కవన ధాటీ విశేషములు తేటపడుటయేగాక వారికి తమ యేలికయెడలగల గౌరవాతిశయములు వెల్లడికాగలవు.

సీ. తనకీర్తి సాహసో ♦ ద్ధతికోడి మృగరాజు
విదితంబు గుహలలో ♦ నోదిగియుండ
తనచెల్వుకును దాన ♦ మునకోడి దినరాజు
నిరతంబుకోలలేక ♦ దిరుగుచుండ
తనదయా గాంభీర్య ♦ తలకుజాలక నదీ
రాజవార్నిశములు ♦ రోజుచుండ
తన ప్రతాపము తేజ ♦ మునుజూచి భయపడి
దినరాజు మేరువ ♦ నెనసియుండ

గీ. నార వీరాధివీరదు ♦ ర్వారశౌర్య
ధుర్య సూర్యకులాంబోధి ♦ తుహినకరుడు
విజయరామావతారమా ♦ విష్ణుమూర్తి
కొలువు గూర్చుండె భీష్మని ♦ చెలువుదోప.

సీ. ఏరాజుకీర్తితో ♦ నెనగాక చంద్రుండు
మేరువప్రాఘున ♦ మెలగుచుండు
నేమహీపతి ధర్మ ♦ మీక్షించి చాలక
ధారాధరము నిల్వ ♦ నీరువిడుచు

నేభర్గ గాంభీర్య ♦ మింతింతనియనలేక
జలధి నితాంత ఘో ♦ షంబుచేయు
నేరాట్ప్రతాపంబు ♦ తోరాక భాస్కరుం
డుదయాస్త మయముల ♦ నుడుగువేడి

గీ. యమ్మహాత్ముడు వినుతి నే ♦ యంగనెగడె
నంగవంగాంధ్ర మత్స్య ♦ కళింగ చోళ
బర్బరపుళింగ మగధ భూ ♦ పాల సభల
విజయ రామావతారమై ♦ వెలయు ప్రభువు.

క. పాలింను సర్వధరణిం
బాలించు ధరామరాళి ♦ బహుభంగుల గో
పాలు గతిసఖిల జనముల
మేలనఁగా విజయరామ ♦ మేటి కిరీటి.

సీ. రక్తరాంకవ తను ♦ త్రాణ నీలోష్ణీష
కాంతులు సాంధ్య రా ♦ గంబుదోప
మహితాచ లాంఘ్రి స ♦ మాజ ఘట్టణ భార
భరమున గడగడ ♦ ధరణి వణక
నాదుకొంతిరుగు ను ♦ బేదాగ్ల విచ్చక
త్తులతళ త్తళలుది ♦ క్కులు జలింప
లయను జెప్పెడి తంబు ♦ రాల ధణంధణ
ధ్వానంబు భూన భోం ♦ తరము మోయ
ఘనపరపాణి విక్రియ ♦ ధనముదాచు
పెట్టెలోయన డబ్బాలు ♦ గట్టిమరియు
చెకుముకి తుపాకులూని ♦ గర్జించు కొనుచు
వీరభటుల పటాలము ♦ ల్వేలు గొలువ.

క. అచలాచల భటపాద
ప్రచయ సముద్భూతరజము ♦ ప్రబలె ఘనంబై
శుచిఖడ్గ జాతజాతను
రుచిమించున్ మించులనిని ♦ రూఢింబల్కన్.

ఉ. ఆలము లన్నవెన్క దిరు ♦ గాడని విక్రమ శక్రనందనుల్
వేలకు నొక్కఁబంటు తగు ♦ వీరులనన్ కడిదేరిచేత డ
బ్బాలుససీలునున్ గల తు ♦ పాకులు బూనినయట్టి భానుపా
రాల జవానులెంతయు ని ♦ రంతరమున్ బహుమంది కొల్వగన్.

ఈ వర్ణనమునకుండగినట్టుల నానాటి మంత్రులలో నొకడగు మాబుర్రా బుచ్చఁమంత్రి తమ్ముడు వెంకనమంత్రిని ప్రశంసించు నొకశతకమున (ఇది మామిత్రులు పండిత వంగూరి సుబ్బారావు పంతులుగారు కనిపెట్టి నాకొసంగి మాబుర్రావారి కృతజ్ఞతకు పాత్రులైరి) నీ విజయరామ మహారాజులుంగారినిగూర్చి యిట్లుచెప్పబడినది.

క. శతముఖునకు సముఁడుమహో
న్నతపదవిని విజయరామ ♦ నరనాథుఁడు స
న్మతి బలమున నీవు బృహ
స్పతి సముడవు బుర్రవంశ ♦ భవ వేంకన్నా.

క. ఋభువిభునిభ శుభవిభవ
ప్రభావ శోభితుఁడు విజయ ♦ రామధరిత్రీ
విభురత్నము నిన్నేలిన
ప్రభువుకదా బుర్రవంశ ♦ భవవేంకన్నా.

క. కుజననిబర్హణ సంతత
సుజనత్రాణార్థజనిత ♦ శుభవిలసదధో
క్షజ విజయరామ నరపతి
భజనోత్సుక బుర్రవంశ ♦ భవవేంకన్నా.

ఈపద్యములు శ్రీవిజయరామమహారాజులుంగారినిగూర్చియు, వారిమంత్రులగూర్చియు ప్రశంసించుటయేగాక, సూరకవివిరచితములగు పొణుగుపాటివేంకటమంత్రి పద్యములను పోలియుండుటచే నానాటికవులు సూరకవిరచనల ననుకరించి యాతని కవనము నావిధమున మెచ్చియుండుటను సూచించుచున్నవి.

సూరకవిది కవికుటుంబమనుట సూరకవి కోవవారాతని యనంతరము గూడ స్థిరపరచిరి. సూరకవి కుమారుడు బాలభాస్కరుడు(II), ఈతనికుమా

రుడు సూరన; ఈతనికుమారుడు బాలభాస్కరుడు (III); ఈతనికుమారుడు బుచ్చివేంకటరాయులు (వీరుసజీవులు. చిన్నతనమున కవనము చెప్పి రాజమహేంద్రిమందు విద్వత్సభను మెప్పించి గొప్పబహుమానము గొన్నవారు) సూరకవి మనుమడగు సూరనను గూర్చి యాతని సమకాలికులు వడిమింటి రామజోగిశాస్త్రిగారు

మ. కవిరాజుల్ గలరెందరైన నిఖిలక్ష్మాచక్రమధ్యంబునన్
దవుగానిమ్ము నిరర్గళ ప్రకటశాపానుగ్రహ ఖండనై
భవశుద్ధాంధ్రవచోధురంధర ఘనప్రాబంధికుల్ వేరలే
రవురా శ్రీయడిదంబు సూరకవిచంద్రా సాంద్ర తేజోనిధీ.

(యని చెప్పిరి.)

ఈ సూరన కుమారుడగు బాలభాస్కరుడు (III) శ్రీ మాదుగుల సంస్థానమందు శ్రీకృష్ణభూపతిదేవు మహారాజులుంగారిచే సన్మానింపబడుచు తనతాతసూరకవివలెనే దేశాటనముచేయుచు కవితావృత్తిచేజీవించుచుండెను. ఈతడు సంగీతసాహిత్యములందు నేర్పరి. విద్వత్సభలయందు సభారంజకముగ నాశుకవిత్వము జెప్పి నవరోజురాగముతో పద్యములు చదువుచుండెడివాడనియాతని మనుమలగు శ్రీపాగరు కృష్ణమూర్తి పంతులుగారు నాతో సెలవిచ్చిరి. సూరకవియునిట్లే యేదోయొక రాగవరుసనుపద్యములుచదివియుండవలెను.

సూరకవి రచనలలో మూడువంతులాశువులే. ఒకవంతు కావ్యములు.

పూర్వాంధ్ర కవులవలె పదునెనిమిదవ శతాబ్దమున వన్నెకెక్కినప్రాబంధికుడై సరసముగ కవనము సాగించియు, రామలింగేశశతకమువంటి రచనలయందానాటిలోక వ్యవహార విమర్శనమును ధర్మానుసారముగ నెరపి సత్కవియనదగియు, సుఖజీవనోపాయములంతగా లేకుండుటచే రాజావలంబనము నపేక్షించియు కూటికై యాత్మస్వాతంత్ర్యమును కోల్పోకుండియు సమకాలికులకును, ఆంధ్రలోకమునకును సంభావ్యుడగునట్టి యీయడిదము సూరకవి జీవితచరిత్రమును సవిమర్శముగఁ జదివి లోతుపాతులరసి "యాంధ్రావళి మోదముంబొరయు"గావుతమని మాసంపాదకీయ విన్నపము.

బుర్రా శేషగిరిరావు.

# పీఠిక.

నేనీగ్రంథము కొన్ని సంవత్సరముల క్రిందట నారంభించి మూఁడు నాలుగు ప్రకరణములు మాత్రము వ్రాసి కారణాంతరములచే నసంపూర్తిగ విడిచిపెట్టితిని. కాని నామిత్రులగు మ॥ రా॥ రా॥ శ్రీ గాడె నరసింగరావు పంతులు బి. ఏ. గారి ప్రోత్సాహమున దీనియందలి యొకప్రకరణము(చెఱువుమీఁది పద్యములు. విమర్శనము) ప్రత్యేకముగ నొక చిన్న పుస్తకరూపము నఁబ్రచురించితిని. ఆ విమర్శనము నాయదృష్టవశమునఁ బలువుర విద్యార్థులయాదరమును బొందినది.

ఇది యిట్లుండ, గతసంవత్సర మీపురమున నీ«యాంధ్రపారిజాతము" భాషాభిమానులును నామిత్రులునగు మ॥ రా॥ రా॥ శ్రీ వేమూరి వేంకటకృష్ణయ్యపంతులుగారిచే నెలకొల్పఁబడినది. వ్యయప్రయాసములకు వెనుదీయక యిట్టి కాకితపుఁ గఱవుదినములలో నీమహోద్యమము లేవనెత్తిన మా వేంకటకృష్ణయ్యగారి,యుత్సాహమునునౌదార్యమును భాషాభిమానమును నెంతయుఁ బ్రశంసనీయములు. వీరును, నాహితులగు మ॥ రా॥ రా॥ శ్రీ బుఱ్ఱా శేషగిరిరావుపంతులు (M. A.)గారును, భోగరాజు నారాయణమూర్తిపంతులు గారును, నన్ను హెచ్చరింప నీగ్రంథమును మొన్నటి వేసవికాలపుదినములలోఁ బూర్తిచేసి, యీపారిజాతమున కునిచ్చితిని.

ఈగ్రంథభాగములను జాలవఱకు వినియును, వలయుచోట్లఁ దగిన సలహాలనిచ్చియును,నన్నుఁ బ్రోత్సాహపఱచి నాయెడల సోదరభావముసు జూపిన నామిత్రులు శ్రీపజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారికిని,కావ్యకంఠ శ్రీగోర్తి సూర్యనారాయణశాస్త్రిగారికిని నాకృతజ్ఞతాపూర్వక నమస్కారములనునర్పించుచున్నాఁడను. అచ్చుచిత్తులు దిద్దుటయందును నింకనితర విషయములయందును నాకు సాయపడిన శ్రీ దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారికి నెంతయుఁగృతజ్ఞుఁడను.

మహారాజుపేట,
విజయనగరము.
8 జనెవరు 1919

ఇట్లు బుధవిధేయుఁడు,
అడిదము రామారావు.

శ్రీరస్తు.

# అడిదము సూరకవి.

## మొదటి ప్రకరణము.

### వంశపూర్వ చారిత్రము—గృహనామము.

చ. ఇరువదిమూఁడు పూరుషము ♦ లిప్పటికయ్యెఁ గవిత్వ వృత్తిచే
నరపతులెల్ల మెచ్చఁ బదు ♦ నాల్గుతరంబులు మించుపిమ్మటన్
వెరపగుజీవనస్థితి ల ♦ భించుట, తొమ్మిదియయ్యెఁ బూరుషాం
తరములు నిక్కలింగ వసు ♦ ధాధవుచెంగట నాశ్రయించుటల్.

(సూరకవి చాటుధార.)

ఆంధ్రదేశమునఁ గవితావృత్తిచేఁ బ్రఖ్యాతిగాంచిన నియోగికుటుంబములలో నడిదమువారి కుటుంబమొకటియని చెప్పనగును. తొలుదొల్త వీరియింటిపేరు 'మోదుకూరువారు'. ఈకుటుంబమునఁ గొందఱు ప్రసిద్ధకవులు తమ గ్రంథములను నేనుంగులపైని వేసికొని దేశాటనముచేయుచు రాజస్థానముల ను దర్శించి జీవయాత్ర గడపుచువచ్చుటచేతఁ గొంతకాలము వీరికి "గ్రంథవారణము" వారనియు గృహనామము గలిగి యుండెడిది. మఱికొంత కాలమునకుఁ బిదప నీవంశజులలో నొకఁడగు నీలాద్రికవి కళింగరాజులలో నొకనియొద్ద నాస్థాన కవిగానుండి యొకానొక సమయమునఁ దనప్రభువుతోఁ గూడ యుద్ధమునకై వెడలెను. బ్రాహ్మణుఁడయ్యును సమరద్రోణా చార్యునిపగిది నీలాద్రికవి యుద్ధరంగమున వెల్లడించిన సాహస

పరాక్రమంబులకు రాజెంతయు నాశ్చర్యమునొంది నీలాద్రికవిని నుచితరీతిని గౌరవింప సంకల్పించుకొనెను. కవియు నాయుద్ధమునఁ దనయేలికగాంచిన విజయమును గడించుచు "రణరంగవిజయమ" నుపేర నొక యాంధ్రప్రబంధమును రచించి రాజునకంకితమొనర్చెను. నిందుకొల్చిన రాజీగ్రంథమును సాంతముగ విని యానందించి కవికి ద్రవ్యరూపముగు పసదనమొసఁగుటయేగాక నీలాద్రి యుద్ధరంగమున వెల్లడించిన ధైర్య సాహసములకుఁదగిన పారితోషికమని యెంచి యొకకరవాలము (అడిదము)ను గానుకగా నొసంగి కవిని గౌరవించెను. నాఁటనుండియు నీవంశజులకు 'అడిదము' వారని యింటిపేరు గలిగెను.

మీఁదియంశములను సప్రమాణముగఁ దెలుపుటకుఁదగిన యాధారములు గానరాకున్నను, సంప్రదాయసిద్ధముగ వచ్చుచున్న విషయములగుటచే నిందుఁబొందుపఱుపఁ బడినవి. ఏదియెట్లున్నను బ్రికరణప్రారంభములో వ్రాయఁబడిన "ఇరువదిమూఁడు పూరుషములు" అను సూరకవి చాటుపద్యమును బట్టి సూరకవికిముందుఁ జాలతరములనుండి యీవంశజులు కవిత్వవృత్తిచే జీవించుచు వచ్చిరని చెప్పుటకేమియు నాక్షేపణముండదు. మాగోత్రము మోదుకూరివారి గోత్రమును వసిష్ఠగోత్రమైన కారణముచేతఁ గొండొకకాలమున నీయడిదమువారు మోదుకూర్వారై యుండినను నుండవచ్చును.

అడిదము (కత్తి) గానుకగాఁ గాంచిన నీలాద్రికవికి మూఁడవ కుమారుఁడగు బాలభాస్కరకవి శుద్ధాంధ్ర రామాయణ మను నొక యచ్చతెనుఁగు కావ్యమును రచియించి దానిని దేవాంకితమొనర్చెను.

అడిదము బాలభాస్కరుఁడు శుద్ధాంధ్రరామాయణము.

అయ్యది యిప్పటుండియున్నచో 'కూచిమంచి తిమ్మకవి' విరచితమగు "అచ్చతెనుఁగురామాయణము" నకుఁ బూర్వము వ్రాయఁబడినదని మనకు స్పష్టమగును. విధివశమున నాగ్రంథరాజము నామమాత్రావశిష్టమైనది. బాలభాస్కరకవి యాగ్రంథము రచించెననుటకు రెండు ప్రబలప్రమాణములు గానఁబడుచున్నవి. సూరకవి తనగ్రంథములలో వేసికొనియున్న గద్యము "ఇది శ్రీమదశేష మనీషిహృదయంగమ మృదుపద నీరంధ్ర శుద్ధాంధ్ర రామాయణ ఘటనాపటుధీ ధురంధరాడిదము బాలభాస్కరకవి తనూభవ" యనియున్నది. ఇదిగాక సూరకవి విరచిత కవిసంశయ విచ్ఛేదమను లక్షణగ్రంథమున 'ఇకార' సంధికి లక్ష్యముగా నీయఁబడిన "నిగిడిరుసై పులకల్ వెడల నేటయి సీటగు వీటికోట" అను చంపకమాలికాపాదము బాలభాస్కరు శుద్ధాంధ్ర రామాయణములోనిదని సూరకవి యుదాహరించియున్నాఁడు. ఈ యాధారములనుబట్టి సూరకవి తండ్రియగు బాలభాస్కరకవి శుద్ధాంధ్ర రామాయణమును రచించెనను సంగతి నిర్వివాదాంశము. ఈగ్రంథము ఖిలమైపోయినందున,

సూరకవి విరచిత గ్రంథములలో నెక్కడను వంశాభివర్ణనము కానరానందునను నీవంశజుల పూర్వవృత్తాంతము ప్రజ్ఞాదికములు తెలియరాకున్నవి. సూరకవి గ్రంథములలో నెల్ల మిన్నయని వన్నెకెక్కిన కవిజనరంజనములోఁ గూడ నవతారిక పద్యములు గానరావు. రావుబహాదూరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు "సూరకవి ప్రణీతగ్రంథములు" అని యచ్చొత్తించిన సంపుటములోని కవిజనరంజనమునందు నీక్రింది షష్ఠ్యంత మొకటి మాత్రము గానవచ్చుచున్నది.

క. కంఠీరవాక్ష విక్రమ
కుంఠనకును గుంభిదైత్య ◆ కోపాటోపా
కుంఠప్రతాప హరునకుఁ
గంఠేకాలునకుఁ బ్రమథ ◆ గణపాలునకున్.

మాయింటనున్న ప్రతులలో నీపద్యము గానరాదు. సూరకవి తనప్రబంధమున నవతారికపద్యములు చెప్పియుండెనా లేదా యన్నయంశము కొంతవఱకు నాలోచింపవలసియున్నది.

కవిసంశయ విచ్ఛేదమనునొక చిన్న లక్షణగ్రంథమున నియమము దప్పకుండ నీక్రింది యవతారిక పద్యములను సూరన చెప్పియున్నాఁడు.

క. శ్రీనుమమా శంభులను ర
మా మురవైరులను వాక్క ◆ మల సూతులనున్
దేవాచ్చి వినాయకపద
తామరసంబులకు నెఱఁగి ◆ తవిలినవేడ్కన్.

క. వాల్మీకి వ్యాసులకును
గేల్మోగిడిచి నన్నపార్యుఁ ♦ గీర్తించి కవీం
ద్రుల్మెచ్చఁ గవితఁగూర్చు న
కల్మషునిం దిక్కయజ్వ ♦ గణుతించి తగన్.

క. చినలచ్చ మంత్రితనయుని
ననఘుని మజ్జనకు భాస్క ♦ రామాత్యమణిన్
గొలియాడెద శ్లాఘాలం
ఘనజాంఘిక కవనధాటి ♦ గలిగిన మేటిన్.

క. పుడమిఁగల రసికులెల్లఁ బొ
గడఁ గవిజన రంజనకృతి ♦ గావించితి నే
నడిదము సూరకవీంద్రుఁడ
మృడపదపంకజ రిరంసు ♦ మృదుమానసుఁడన్.

ఈరీతిగఁ గృత్యాదిపద్యములను జెప్పియున్న యతఁడు తన గ్రంథములలో ముఖ్యమగు కవిజనరంజనములో నవతారిక పద్యములను జెప్పియుండలేదనుటకు నెంతమాత్రమును వీలుపడదు. చెప్పియే యుండును. ఎటులనో యవి యంతరించిపోయినవి. పూర్వకవులు కృత్యాది పద్యములను విడిచిపెట్టి కథాభాగమును దొలుతవ్రాయు నాచారము గలిగియుండెడి వారేమోయని తోఁచెడిని. ఏది యెట్లున్నను సూరనమాత్రము ప్రారంభముననో లేక గ్రంథపరిసమాప్తి యైనతరువాతనో కృత్యాది పద్యములను వ్రాసి యుండవచ్చుననియే నా నమ్మకము.

# రెండవ ప్రకరణము.

## జన్మాదికము—విద్యాభ్యాసము.



క. చినలచ్చమంత్రి తనయుని
ననఘుని మజ్జనకు భాస్క ♦ రామాత్యమణిన్
గొనియాడెద శ్లాఘాలం
ఘనజాంఘిక కవనఘాటిఁ ♦ గలిగినమేటిన్.

(కవిసంశయ విచ్ఛేదము.)

ఈపద్యమువలన సూరకవి భాస్కరమంత్రి పుత్రుఁడనియు, చినలచ్చమంత్రి పౌత్రుఁడనియుఁ దేలుచున్నది. ఇతఁడు భూపాలరాజు రేగయను గ్రామమున క్రీ॥శ॥ 1720 సం॥ ప్రాంతమున జననమొందెను. ఈగ్రామము విజయనగరమునకుఁ దూర్పుగా నైదుక్రోసుల దూరముననున్నది. దీనికిప్పటి పేరు పూసపాటిరేగ. నాఁటినుండి నేఁటివఱకును నియ్యోగి 'అడిదము' వారికి నివాసస్థలమైయున్న కారణముచేత నిప్పుడు గూడ వారిలో నొకకుటుంబమువారు కరణీకముచేయుచు నిచ్చటనే కాపురముండియున్నారు. "చెఱువుమీఁదిపద్యములు" చెప్పిన రామకవియు సూరకవితండ్రియగు బాలభాస్కరకవియు నొకేకాలమున స్వగ్రామమగు రేగయందు నివసించుచుండిరి. వారినాఁడా గ్రామమునకు భూపాల రాజు రేగయని పేరు.

"అవధారు దేవ! మ ♦ హాప్రభూ! విన్నపంబాశ్రితోత్తముఁడ
శు ♦ ద్ధాంధ్రకవిని । పేరురామన యింటి ♦ పేరడిదమువారు
మాజాగ భూపాల ♦ రాజురేగ ।" అని రామకవి తనచెలువు
మీఁది పద్యములలో నొకదానియందిట్లు చెప్పియున్నాఁడు.
వీరికాలమునకుఁ దరువాత నీగ్రామము మునుపటితావునుండి
మార్పఁబడి యుత్తరముగా వేఱొకస్థలమునఁ గట్టఁబడి యప్పటి
గ్రామపు గుత్తదారుఁడగు దంతులూరి అన్నమరాజుగారిపేరను
"అన్నమరాజురేగ" యని వ్యవహరింపఁబడుచు వచ్చెను.
భూపాలరాజురేగ యనుపేర నీగ్రామము రమారమి యెనుబది
సంవత్సరములవఱకు నుండెననియుఁ బిదపఁగట్టఁబడిన గ్రామము
అన్నమరాజురేగపేరట డెబ్బది సంవత్సరములకుఁ బైగానుండె
ననియు నిప్పటిగ్రామమగు "పూసపాటిరేగ" మొన్నపోయిన
యానంద సంవత్సరమునఁ గాక క్రిందటి యానంద సంవత్సర
మునఁ బూర్వపుస్థలమునుండి యింకొకతావునకు మార్పఁబడి
యచ్చటఁ గట్టఁబడెననియు, మాగ్రామములోని పెద్దలు
చెప్పుచున్నారు. దీనినిఁబట్టి యిప్పటికి నూటముప్పది సంవత్సర
ములక్రిందటి కాలముననున్న గ్రామము భూపాలరాజురేగయని
తెలుచున్నది. క్రీ॥శ॥ 1780-90 సంవత్సర ప్రాంతమువఱకునుండి
యున్నగ్రామము భూపాలరాజురేగయని వ్యవహరింపఁబడుచు
వచ్చినదనుటకు, మాకుటుంబమునందుఁ దరములువెంబడి వచ్చు

చున్న వాడుకచొప్పున సూరకవి యఱువదిమూఁడు సంవత్సరములు జీవించెనని తెలియవచ్చుటచేతను నతఁడు క్రీ॥ శ॥ 1720 సంవత్సరప్రాంతమున జన్మించియుండెననుటకు వీలుకనఁబడుచున్నది.

సూరకవిగారి మనుమఁడగు సూరన 45 సంవత్సరములు జీవించి, క్రిందటి చిత్రభాను సంవత్సరమునఁగాక యటు క్రిందటి చిత్రభానుసంవత్సర ఆషాఢబహుళ పాడ్యమినాఁడు (క్రీ॥ శ॥ 1823 సంవత్సరము) చనిపోయెను. దీనినిబట్టి యతఁడు క్రీ॥ శ॥ 1778 సంవత్సరమున జన్మించియుండవలెనని తేలుచున్నది. ఇతఁడు తనతండ్రిగారికి 28 సంవత్సరములు వయస్సున జన్మించెను. అట్లయినచో సూరకవిగారి కుమారుఁడగు బాలభాస్కరుఁడు 1750 సంవత్సరప్రాంతమున జన్మించియుండవలెను. సూరకవికి 25 సంవత్సరములకు మించినప్రాయమునందు సంతానము కలిగినట్లు వాడుక. ఈరీతిగ మాకుటుంబమునందుఁ బరములవెంబడి వచ్చుచున్న సమాచారమునుబట్టి పరిశీలించినను సూరకవి 1720 సంవత్సర ప్రాంతమున జన్మించియుండవలెననియే తేలుచున్నది.

ఇంతియెగాక, బొబ్బిలియుద్ధమున వీరస్వర్గమునుగాంచిన పెదవిజయరామ మహారాజుగారి కాలమున సూరకవి నిండుజవ్వనమునను న్నవాఁడని యొకప్రబలమగువాడుక గలదు.

ఇందులకుఁ దార్కాణముగ నితఁడు క్రీ॥శ॥ 1746 సంవత్సరమున బాదుల్లాఖానునకును, పెదవిజయరామ మహారాజునకును జరిగిన యుద్ధమును బ్రశంసించుచు నీక్రిందిపద్యములను జెప్పి యున్నాఁడు.

గీ. మొత్త నైనట్టి యరఁటాఁకు ◆ మీఁద గాక
మంటమీఁదను జెల్లునే ? ◆ మొంటివాఁడి
బీదలై నట్టి సరదార్ల ◆ మీఁద గాఁక
కలదె క్రొవ్వాడి బాదుల్ల ◆ ఖానుమీఁద.

సీ. గరిడీలలోపల ◆ గంతువేయుట కేమి
యీఁటెఁబట్టి యరిపై ◆ దాఁటవలెను
సాగనుగ పులకత్తి ◆ బిగియఁజెక్కుట కేమి
వెఱవక వైరుల ◆ నఱకవలెను
మాటిమాటికిఁ బెద్ద ◆ మాటలాడుట కేమి
యదలించి రిపులఁ జెం ◆ డాడవలెను
అమ్మ్రన నెత్తగం ◆ దమ్ముఁ బూయుట కేమి
గాయంపు నెత్తురుల్ ◆ గ్రమ్మవలెను

గీ. గాని లేకున్న సత్కీర్తి ◆ కాంతగలదె ?
పూసపాటి కులాంభోధి ◆| పూర్ణసోమ !
సమరజయభీమ ! గజపతి ◆ సార్వభౌమ !
విమలసద్గుణధామ ! శ్రీ ◆ విజయరామ !

ఉ. ఢిల్లీలోపల గోలకొండపురి నుం ◆ డెన్. నీప్రశంసల్ గుటాల్
బల్లాలంబాడిపించి హుమ్మని యుర ◆ బ్బానెక్కి పైకొంచు బా

ధుల్లాఖానుని శౌర్యదర్పోలితవిని దోశ్శక్తి * సుబాబాలకున్
మళ్లింపం దరమౌనె ? శ్రీ విజయరా మా ! మండలాధీశ్వరా !

ఇట్లు నిరాఘాటముగఁ గవిత్వముఁ జెప్పఁగలిగిన సూరకవి యప్పటికి నిరువదియైదు సంవత్సరములకుఁ దక్కువగాని యీడున నుండవలెనని యూహింపనగును. అట్లనుకొనినచో నతఁడు క్రీ॥ శ॥ 1720 సంవత్సరప్రాంతమున జన్మించియుండె ననుటకుఁ బ్రతిబంధకము గానరాదు.

సూరకవికి నక్షరాభ్యాసము మొదలు సంస్కృతాంధ్రములయందుఁ జక్కని సాహిత్యమలవడువఱకును దండ్రియగు బాలభాస్కరకవియే విద్యగఱపెను. ఇతఁడు పండ్రెండు పదుమూఁడు వత్సరముల వయస్సుకలవాఁడై యున్నప్పుడు తండ్రి

* సుబా — హిం. పి. రాజ్యమునందొక గొప్పభాగము — అని శబ్దరత్నాకరము.

సూబా:— అనఁగా నొక్క రాజ్యభాగమును బరిపాలించువాఁడు. ఈ యర్థమున నీపదము ఇంగ్లీషుభాషలో వ్రాయఁబడిన దేశచరిత్రలందు వాడఁబడి యున్నది.

The Subah Salabadjing, on his return from Maslipatam, halted within four days of Hydrabad, and commenced a negotiation with his brother Nizamally. (Orme's History of the Indostan Vol. II Book No. XI Page 504.)

సాలబత్ జింగుసూబా మచిలీబందరునుండి తిరుగుదలలో హైదరాబాదునకు నాలుగుదినముల ప్రయాణపుదూరమున నిలిచి తనసోదరుఁడగు నిజామలీతో సంధిప్రయత్నములు చేయ మొదలుపెట్టెను.

గారియొద్ద నొకనాఁడొక యాంధ్రగ్రంథము పాఠముఁజెప్పి కొనుచునందు 'తగ । మావిమూఁక వసంతాగ ♦ మంబుతేక' యను గీతపద్యభాగమును జూచి యందలి 'తగక' అను వ్యర్థ పదప్రయోగమును గూర్చి తండ్రిగారితోఁ జర్చింప నంతచిన్న వయసునఁ దన కుమారుఁడు చేయువిమర్శనకు భాస్కరకవి లోలోన సంతసించుచు వచ్చెను. ఇట్లు సూరన యిరువది సంవత్సరముల ప్రాయము వచ్చువఱకుఁ దండ్రిగారిచేతనే సాహిత్య సంపాదనమునందును, కవితా రచనా విధానముల యందును శిక్షితుఁడై తండ్రికిఁ జేతికందినకొడుకై వర్ధిల్లు చుండెను. సూరకవి విద్యాభ్యాస సందర్భముననుసరించి బాల భాస్కరకవి వర్ణాదివిశేషములు కొంతవఱకు వెల్లడింప నవకాశము గలదు. సూరకవికి రమారమి యిరువదియైదు సంవత్సరములు వయస్సు వచ్చువఱకు నీభాస్కరకవి జీవించి యుండెను. తండ్రిమరణమువనుక రేగవిడిచి సూరకవి వేఱొండు చోటునకు వెళ్ళుటలేదు. అతని విద్యాభ్యాసమంతయు రేగ యందే జరిగెను. అదియుఁ దండ్రి గారియొద్దనే. మా గ్రామమున మా కుటుంబముతోపాటు పూర్వము నుండియు కాఁపురము డియున్న వైదికులు 'ఓరుగంటి' వారి కుటుంబమొకటి కలదు. కాని విద్యాధికులగు పండితులుండి యుండినన్న ప్రసిద్ధి యాకుటుంబమునకు లేదు. అహేతువుచేత

సూరకవికి విద్యాగురు వతని తండ్రిగారే యని నిశ్చయించితిని. సూరకవిప్రణీతగ్రంథములను జక్కఁగఁ బరిశీలించి చూచిన-చో నతనికి నుభయభాషలయందును నఖండమగు పాండిత్యము కలదనియు, సంస్కృతమున నతఁడు నాటకాలంకారసాహిత్యము గలవాఁడగుటయేగాక పాణినీయ వ్యాకరణజ్ఞుండునుగూడనై యుండినట్లు కనఁబడుచున్నది. ఇట్టి విద్యాసంపాదనమునకుఁ గారణభూతుఁడును గురువునునగు బాలభాస్కరకవి యుభయభాషా కోవిదుఁడై యుండునని నా నమ్మకము. సూరన తన క॥ సం॥ వి॥ లో "......శ్లాఘూలంఘనజాంఘిక కవనధాటి ♦ కలిగినమేటిన్" అని తండ్రిగారిని నుతించి యున్నాఁడు. శుద్ధాంధ్ర రామాయణములోనిదగు " నిగిడిరునై పులన్వెడల ♦ నేటయి నీటగు వీటికోట" అను నీచంపకమాలికా పాదము వసుచరిత్రములోని "వీటన్మీటగు జోటు లేటివరద ♦ న్వేమారు గ్రీడింప " etc అను పద్యము ఛాయనున్నది. దీనినిబట్టిచూడ బాలభాస్కరకవి వసుచరిత్ర మొదలగు ప్రబంధరత్నముల కవితాధోరణిని దనకు మేలుబంతి (model) గా నిడుకొని యీయచ్చతెనుఁగుఁ గబ్బము మిగుల రసవత్తరముగ రచించెనని నేనూహించుచున్నాఁడను.

---

# మూఁడవ ప్రకరణము

—చీపురుపల్లికిఁ గాఁపురము మార్చుట.—



సూరకవి తనతండ్రియగు బాలభాస్కరుని మరణానంతరమున స్వగ్రామమగు రేగనువిడిచి చీపురుపల్లెకు (విజయనగరమునకు నీశాన్యముగా నిరువదిమైళ్ళ దూరమున నున్నది) మిక్కిలిసమీపముననున్న రామచంద్రపురమును (గులివిందాడ) దనకు నివాసస్థలముగ నేర్పఱుచుకొని యామరణాంతమచ్చటనే నివసించియుండెను. కవికిని నింకొకరికిని బద్యరూపమున జరిగిన సంభాషణ వలన నితఁడు చీపురుపల్లెయం దున్నట్లు తెలియవచ్చెడిని.

క. ఊరెయ్యది ? చీఁపురుపలి
పేరో ? సూరకవి యింటి పేరడిదమువార్
మీరాజు ? విజయరామ మ
హారాజతఁడేమి సరసుఁ డా ? భోజుఁడయా.

రేగయందు వలెనే కవికిఁ జీపురుపల్లెకు దగ్గఱనున్న కంచరాములో మాన్యముండెడిది. ఇప్పటివలెఁ గాక సూరకవి, రామకవిగార్ల కాలమున రేగమాన్యములేమి కంచరమునఁ గల మాన్యము లేమి ప్రతిసంవత్సరము పండెడివికావు. ఈమాన్యముల పంటపర్యాయములనుగూర్చియే సూరకవియిట్లుచెప్పియున్నాఁడు.

చ. గరిసెలు వ్రాఁతగాని యొక ♦ గంటెఁడెఱుంగము మన్యదేశముల్
దిరిగి యభీష్టవస్తువులు ♦ తెచ్చి భుజింతుము సర్వకాలమున్
సురుచిర సత్కవిత్వనిధి ♦ సూరకవీంద్రుని తెలగన్నెఁ గం
చరమును రేగమేఁక మెడ ♦ చన్నులవంటివి రెండు మాన్యముల్.

సూరకవి, తండ్రిగారు స్వర్గస్థులైన వెంటనే తన నివాసస్థలమును మార్చుటకుఁ గల కారణములు తెలియరాకున్నవి. చీపురుపల్లెను సమీపమునఁ గంచరములో మాన్యముండుటయు, తనకిష్టదైవమగు రామలింగేశ్వరునకు మనికిపట్టగు రామచంద్రపురమును దనకు నివాసస్థలముగాఁ జేసికొన నాసక్తియుఁ దాను ప్రతిసంవత్సరము వర్షాశనమునకై పోయి చూచెడు మన్యప్రజమీాలకుఁ జీపురుపల్లె మధ్యస్థముగ నుండుటయు నను నీకారణములతని స్వస్థానచలనమునకు హేతువులై యుండుననినాకుఁ దోఁచెడిని. ఈ రామచంద్రపురమునఁ గల శ్రీరామలింగేశ్వరాలయమును అడిదము వారి కోవెలయని యు దానికి సమీాపమున నున్న ప్రదేశము పూర్వము ‘అడిదము’ వారి యింటి నివేశనమని యు నిప్పటికిని నచ్చటివారు చెప్పుచుండుట గలదు. సూరకవి, యిరువదియైదు సంవత్సరముల ప్రాయమప్పుడు చీపురుపల్లె, ప్రవేశించెను; తన జీవితకాలమంతయు నచ్చటనే యుండెను. కవిజనరంజనాది గ్రంథరాజములెల్ల నచటనే రచనమొనర్చెను. ఇతనికి నాగాప్రభుమునను వైదికులు కొందఱు శిష్యులై యుండిరి. అయ్యది యీక్రింది పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

గీ. పారమందిరి యక్కొన ♦ పల్లివారు
నుక్కుచేతను దీరఁడెం ♦ దువ్వులకెల్ల
దూసికృష్ణుండు చదువంబె ♦ దుఃఖపడును
ధీరుఁడై నిలిచె మురపాక ♦ సూరనకవి.

ఈపద్యమునఁ బేర్కొనఁ బడిన కుటుంబముల వారిసంతతివా రిప్పటికిని రామచంద్రపురము (గులిపెందాడ) నందుఁ గాఁపురముండి యున్నారు.

సాధారణముగా నాంధ్ర కవీశ్వరులను జెట్టబట్టిన దరిద్రితాదేవి యొక్క కటాక్షవీక్షణములకు సూరకవి గూడ దూరముగఁ దొలఁగి యున్నవాఁడు కాఁడు. సమీపగ్రామమున నున్న యొక రాచకుమారుఁడు కవికిఁ జింతకాయ లిచ్చెదనని చెప్పి పలుసారులు త్రిప్పినట్లును, దానికి సూరన విసుగుఁజెంది శంబాము గ్రామము బాటకియగు రేగానిసన్నిగాఁడు చింతకాయలిచ్చి కవిని సంతోషపఱిచి నట్లును నీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

గీ. బంట్లు నోడలు పట్టివు ♦ వలంటులైతె
చేరవేడిన నీఁడాయెఁ ♦ జింతకాయ
కొండశంబాములో రాచ ♦ కొడుకుకన్న
* శంబమునమేలు రేగాని ♦ సన్నిగాఁడు.

ఇతఁడిచట నున్న కాలమున మన్యపు జమీాలకుఁ బోయెను.

---

* పా॥ చాగమున మేలు రేగాని సన్నిగాఁడు.

ధనము సంపాదించి దానిచేఁ గాలక్షేపము చేయుచుండెడివాఁడు ఇదియే పూర్వోదాహృత పద్యమున " మన్య దేశముల్ తిరిగి యభీష్టవస్తువులు తెచ్చి భుజింతుము సర్వకాలమున్ "అని చెప్పఁబడెను. ఇంతియ గాక యితఁడు చీపురుపల్లెలోను దానిసమీప గ్రామములలోను స్వగ్రామ మగు భూపాలరాజు రేగలోను వైశ్యుల యిండ్లకడ వివాహములు జరిగినపుడు తప్పక యచ్చటికిఁబోయి కవీశ్వర సంభావనలను గైకొనెడి వాఁడు. దీనిని గూర్చియే కవి తన రామలింగేశ్వర శతకములో * " కవులకీఁ గలజాతి యొక్కటియు లేదు । వితరణము వైశ్యులకుఁ బెండ్లివేళ కలదు । కొంకుపఱతురుకుపతులా కూటికొఱకు । రామలింగేశ రామచంద్రపురవాస ॥ " అని వ్రాసియున్నాఁడు. మొత్తము మీఁద సూరకవి చీపురపల్లెలోఁ దన జీవితమును నిబ్బంది లేకుండఁగఁ జరిపినట్లు కనఁబడదు. ఇతఁడు తనతండ్రిగారి సంరక్షణలో

---

* చినవిజయరామ మహారాజాగారి కాలమున నాయన యగ్రజుఁడు సీతారామరాజాగారు దివానుగా నుండి రాజకీయ వ్యవహారములలో సర్వాధికారము జరుపుచుండెడి వారు. ఒకప్పుడాయన సూరకవిని, కోమటిపెండ్లిండ్లసంభావనల నెపమున దర్బారు విడిచి పోఁగూడదని యాజ్ఞ పెట్టెనఁట. కాని సూరకవి మాత్రమట్టి యాజ్ఞను మన్నింపక విధిగాఁ గోమటి పెండ్లిండ్ల సంభావనలకుఁ బోవుచుండెడి వాఁడు. ఆవిషయమే యిచట సూచింపఁబడినది.

హాయిగ నుండి సౌఖ్యమనుభవించినట్లుగ ‡ "తండ్రి గల్గిన పెన్నిధాన మేల" అను రామలింగేశ శతకములోని వాక్యమును బట్టి యూహింపనగును. సూరకవికి నతని తండ్రిగారు సజీవులై యున్నప్పుడే వివాహమాయెను. ఆకాలమునఁ గోటిపల్లెయందు నివసించెడి వడ్డాది వారిపిల్లను నీతఁడు పెండ్లియాడెను. రైలు లేని యాదినములలో నిట్టి దూరదేశపు సంబంధము మాకుటుంబమున కెట్లు కలిగెనో యూహింప వీలులేకున్నది. ఒకానొకప్పు డు నితఁడేదియో రోగముచే బాధపడుచుండి యాసమాచారము నత్తవారికిఁ దెలియఁజేయ వారెవరును రానందులకు వగచి యాతని భార్యదానిని గూర్చి ప్రశంసింప నతఁడు "తెలియని దానవు సుమ్మీ! పిలిచినపరుఁగెత్తి రాను పెండ్లా వడుగా"యని భార్యతోననెను. చీపురుపల్లెలో నున్న కాలముననే సూరకవి సంతానవంతుఁ డయ్యెను. ఇతనికి నొక కుమారుఁడును నొక కొమార్తెయును గలిగిరి. కుమారునికి బాలభాస్కరుఁడనియు, కొమార్తెకు నరసమ్మయనియుఁ బేర్లుపెట్టెను. కొమార్తెను రెల్లివలస పాణంగిపల్లి వారికిచ్చెను. ఈపాణంగిపల్లి వారితోఁ జేసిన సంబంధమును బట్టియే సూరకవికిఁ బిదపనాతని కుటుంబ

‡ ఇయ్యది భవభూతి మహాకవి యుత్తర రామచరితములోని "గీ. మంచిచెడ్డలుతండ్రిపరీ ♦ క్షించుచుండఁ। దల్లులను ముద్దుముచ్చటల్ ♦ దలఁచుచుండఁ। గొప్ప తపిరియు గాండ్రతోఁ గూడి ♦ మెలికినట్టి। క్షణములవి తమ్ముఁడారావు ♦ కదమతెంక॥" అను శ్రీరాముని వాక్యములను జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. అ॥ రా॥

మువారు రేల్లివలసను దమకు నివాసస్థానముగఁ జేసికొనిరి. సూరకవి తన కుమారునిఁ బెంచిపెద్దవానిని జేసి విద్యాబుద్ధులు గఱపెను గాని యతఁడే విషయమునను బ్రజ్ఞావంతుఁడై ప్రసిద్ధి గని తండ్రిగారి కీర్తిని నిలిపినట్లుఁగపడదు. ఇతఁడే సూరకవి మరణించిన పిదప ‹చీపురుపల్లె› నుండి రేల్లివలసకుఁ గాఁపురము మార్చెను.

ఒకానొకప్పుడు భోజన సమయమున సూరకవిగారి భార్య (ఈమె పేరు సీతమ్మ) సూరకవితో "ఏమండీ ; అందఱి మీఁదను బద్యములు చెప్పుదురు గదా : మనబాచన్నమీఁది నేల యొక పద్యము చెప్పరాదు ? " అని కోరఁగా సూరకవి యిట్లొక పద్యమును జెప్పెను.

క. బాచా బూచుల లోపల
బాచన్నే పెద్దబూచి ♦ పల్లెందామన్
బూచంటె రాత్రివెఱతురు
బాచన్నను జూచిపట్టి ♦ పగలే వెఱతుర్.

రూపసికానట్టి తమ కుమారుని స్వభావోక్తిగ వర్ణించుట యిష్టములేనిదైన యామె భర్తతో "చాలునండి. మ గొప్పపద్యము చెప్పినారు. మా బాచబాబుకేమి తక్కువ! యని భర్తయెడల సరసాళించుకొనెను. సూరకవి యామెనిం ను నెగతాళిచేయ నెంచి యిదిజరిగిన యొకటి రెండుదినము

పలుకు మామూలు మాటలలో సహితము పరియాచకత్వమునకై నడుమనడుమఁ బద్యరూపముగ సంభాషించుచు వచ్చెనఁట. ‘ వంటయేమి చేయుదు ’ నని భార్య యడిగినపుడు సూరకవి “ పులగములోపలికి పచ్చిపులుసే కాదా ? ”యని చెప్పిన పద్య పాదము మీఁది యంశమును రుజువుచేయఁగలదు.

వాడుక ననుసరించి చెప్పఁబూనినచో సూరకవి యొక మాదిరి లావుశరీరమును,నల్లనిశరీరచ్ఛాయయుఁ గలిగి పొడుపుగ నుండెడివాఁడనిచెప్పవలెను. “ అతని వేషంబంతయుఁబండితరీతి నుండక మొగలాయి విధంబున నుండు. కావునఁ దదనుగుణమైన లాగు, పాగా, యంగరఖాలనుదాల్చి యొకపక్క గంటపుటొర యును,రెండువదిక్కున బాఁకును బూని ‘ ఇదం బ్రాహ్మ్యమిదం క్షాత్ర ’మ్మను రీతినుండి యేరైన మీరెవరనియడిగిన నేనడిదము సూరుఁడననుచుండు. ” (గు॥ శ్రీరామమూర్తిగారి కవి జీవితములు.)

# నాలుగవ ప్రకరణము

## సూరకవికాలము.

ఈ కవికాలమును నిర్ధారణచేయు సందర్భమున నితనికి నాశ్రియులును, ప్రభువులును నగు శ్రీవిజయనగరాధీశులను గూర్చియు,వారి సంస్థానమును గూర్చియు నిందుఁ గొంతవఱకు వివరించుట యనుచితము కానేరదు.

శ్రీవిజయనగర ప్రభువులగు శ్రీపూసపాటివారు సూర్య వంశజులు. దుర్గాసాక్షాత్కారముఁబొంది, తనతపఃప్రభావమునఁ దానేలు రాజ్యమున నేఁబదిగడియల కాలము సువర్ణవృష్టి గురిపించెనను ప్రసిద్ధిగన్న శ్రీమాధవవర్మ సంతతివారు. "కొం డపల్లి సర్కారులోని పూసపాడను గ్రామనివాసము చేత వీరికి పూసపాటి వారని యింటిపేరు గలిగినది. ఓరుగంటి సంస్థాన ము ప్రతాపరుద్రునితో నశించిన వెనుక వత్సవాయివారు, పూసపాటివారు మొదలయిన వారు మహమ్మదీయులకు లోఁబ డిరి. రఘునాథరాజను మాఱుపేరు గల * పూసపాటి తమ్మిరా జుగారు గోలకొండలో సరదారుగానుండి శ్రీకాకుళమునకు వచ్చి,

---

* " ఈతమ్మిరాజుగారికి రఘునాథరాజను మాఱుపేరు లేదు. ఈయన యన్నగారి పేరు రఘునాథరాజు. "శ్రీకృష్ణవిజయము" న నీవిషయము స్ప ష్టముగఁ జెప్పబడియున్నది. ఈతమ్మిరాజుగారే కృష్ణవిజయము"ను రచించిన కవి. వ్యవహారమున నీయనకు మాధవ వర్మయని వాడుక యుండినట్లుగఁ జరిత్రి లవలనఁ దెలియుచున్నది—విశాఖపట్టణ మండల చరిత్రమున నిట్లున్నది.



శ్రీకాకుళమునకు ఫౌజుదారుగా నుండిన షేరుమహమ్మదుఖాను వలన 1652 సంవత్సరమున కూలిమి ‡ భోగాపురపు తాలూకాలను గుత్తకు పుచ్చుకొని పాలనముచేయ నారంభించెను. † ఈయన పుత్రుఁడైన శీతారామచంద్రరాజుగారు మఱికొన్ని తాలూకాలను గూడ కవులునకు పుచ్చుకొని పర్లాకిమిడిసంస్థానాధిపతియైన గజపతి దేవుతో మైత్రి సంపాదించి 125 గుఱ్ఱపు రౌతులతోను 450 కాల్బలముతోను పొట్నూరు జయించి కళింగరాజని పేరు వడసి యాయూరు నివాసమేర్పరుచుకొని

---

"పూసపాటివారి వంశములో మాధవవర్మగారు మొదట అప్పుడు శ్రీకాకుళము స ర్కారులో నొక భాగమున నుండు విశాఖపట్టణ జిల్లాలోనికి వచ్చిరి. 1652 సంవత్సరములో ననగా రాజగు నవురంగజేబువారి వలన గోలకొండ వారి వంశము నశింపుచేయఁబడకపూర్వము 35 సంవత్సరముల క్రిందట నాయన వచ్చుట జరిగినది. అప్పటిలో షేరుమహమ్మదుఖాను శ్రీకాకుళములో ఫవుజుదారుగా నుండెను. ఆయనయొద్ద మాధవవర్మగారు కూమిలె, భోగాపురముల నిజారాచేసిరి. "—7 వ. అధ్యా. పుట 501—(కార్మైయకలుదొరవారియింగ్లీషుగ్రంధమునకు విజాపురపు కోదండరావు పంతులుగారి తెనుఁగు తర్జుమా.)

‡ ఇది కుమిలిగాని కూలిమిగాదు. మాగ్రామమగు రేగకునిది మూఁడు మైళ్ళదూరమున నున్నది. దీనినే కుంభిళాపురమని ఉషాభ్యుదయము మొదలగు గ్రంధములలో వాడి యున్నారు.

† సీతారామచంద్రరాజుగారు తమ్మిరాజుగారి పుత్రులుగారు. తమ్మిరాజుగారి తమ్ముఁడగు అన్నమరాజుగారి పుత్రులు. ఈవిషయము కృష్ణవిజయమునందును,పూసపాటి వేంకటపతిరాజు మహారాజపరిణీతమగుఉషాభ్యుదయమునందును స్పష్టముగ నివఛింపఁబడి యున్నది.

ప్రబలుఁడై యుండెను. ఈయన యనంతరమున *నానందరాజుగారు పరిపాలనమునకు వచ్చిరి. ఈయన పుత్రులు విజయరామరాజుగారు బహుప్రసిద్ధ పురుషులు. ఈయన మన్నెదొరలను గెలిచి వారి దేశము లాక్రమించుకొని మన్నెసుల్తాను బిరుదంది, పొట్నూరునుండి తనపేరిట విజయనగరమను పేరఁ బరఁగిన యూరికి రాజధానిని మార్చుకొని 1712 వ సంవత్సరమునకు సరియైన విజయసంవత్సర విజయదశమీ జయవారము నాఁడు కోటకట్టుటకు శంకుస్థాపనము చేసెను.

1753 వ సంవత్సరమున నిజాము, కొండపల్లి, యలూరు, రాజమహేంద్రివరము, శ్రీకాకుళము సర్కారులను ఫ్రెంచివారికిచ్చెను. అప్పుడు విజయరామరాజుగారు శ్రీకాకుళమునకు నాయిబయిన జాఫరల్లీతోఁ జేరి దేశము ఫ్రెంచివారికి స్వాధీనము కాకుండునట్లు చేయుటకయి ప్రయత్నించెను గాని, వారు రాజమహేంద్రివరము శ్రీకాకుళపు సర్కారులను తక్కువ సిస్తుకు కవులునకిచ్చెద మన్నందున జాఫరల్లీని విడిచి ఫ్రెంచివారితోఁ జేరెను. తరువాత సర్కారులోని రాజులందఱును ఫ్రెంచివారికి లోఁబడక తిరుగఁబడి నప్పుడు సహితమీయన

* ఈ ఆనందరాజుగారిని సీతారామచంద్రి మహారాజులుంగారు శ్రీపూసపాటి పెదజగన్నాధరాజుగారి కుటుంబములోనుండి దత్తతచేసికొని నట్లు కనఁబడుచున్నది.

వారియెడల విశ్వాసము గలవాఁడయి యుండి 1755 వ సంవత్సరమున ఫ్రెంచి సేనానాయకుఁడయిన బుస్సీకి కావలసిన ధనము రహస్యముగాఁ బంపెను. తరువాత బుస్సీసేనలతో దేశము స్వాధీనముచేసి కొనుటకు కళింగదేశమునకు వచ్చి నప్పాడీయన బొబ్బిలివారితోడి తనపూర్వ వైరమును సాధించుకొనుటకయి బుస్సీని పురికొల్పి యుద్ధముచేయునట్లుచేసి తానుగూడ సేనలతోఁబోయి 1757 సం॥ జనవరునెల 24 వ తేదీని తాండ్ర పాపయ్యచే పొడువబడి పరమపదము నొందెను. తరువాత విజయరామరాజుగారి * పితృవ్యపుత్రుఁడైన యానందగజపతిరాజుగారు సింహాసనమునకు వచ్చి, బుస్సీ విజయరామరాజుగారి యెడలఁ జూపిన యాదరమును తన యెడలఁ జూపకపోవుటచేత మనసులో ద్వేషముపెట్టుకొని బుస్సీ విశాఖపట్టణము మొదలైనస్థానముల నన్నిటిని స్వాధీనము చేసికొని పైయధికారుల యుత్తరువు ననుసరించి యీదేశమును విడిచి కర్ణాటకమునకు వెడలిపోఁగానే సేనలను గూర్చుకొనిపోయి విశాపట్టణమును పట్టుకొనిదాని నింగ్లీషువారికి వశపఱచెదనని యుత్తరములు వ్రాసి 1757 సం॥రమున వారితో స్నేహముచేసికొనెను. తరువాత నతఁడు ఫ్రెంచివారి నుత్తరపు సర్కారుల నుండి తఱిమివేయు ప్రయత్నములలో నింగ్లీషువారితోఁ జేరి, దొరకినకొల్లలోఁదనకు భాగమిచ్చునట్లును, జయించిన దేశములో నదీసముద్రతీర

* పితృవ్యపౌత్రులు, గాని, పుత్రులుగారు.

పట్టణములును, వాని చుట్టుపట్లఁగల దేశమునుదక్క మిగిలినభాగమును దన పాలనములో నుంచునట్లును యుద్ధవ్యయముల క్రింద తాను నెల కేఁబదివేలరూపాయల చొప్పున నిచ్చునట్లును ఏర్పఱచుకొని, కర్నల్ ఫోర్డుగారిచే నడపఁబడు చుండిన ఇంగ్లీషుసేనతోఁ దనసేనను జేర్చి దండయాత్రవెడలెను. ఆనఱకే ఫ్రెంచి సేనానాయకుఁడయిన కర్ఫ్లాన్సుగారానందగజపతిరాజుగారిని శిక్షించుటకయి దండయాత్ర వెడలి యింగ్లీషు సేనయాయనతోఁ జేరెనదని విని రాజమహేంద్రవరమున నిలిచిపోయెను. కర్నల్ ఫోర్డుగారానందరాజుగారు వెంటరాఁగా రాజమహేంద్రవరమునకు వచ్చి ఫ్రెంచి సేనాధిపతియైన కర్ఫ్లాన్సగారి నక్కడనుండి పాఱఁదోలి, మచిలీబందరునకుఁ బోయి దానిని స్వాధీనపఱచుకొనెను. దండువెడలియున్న యింగ్లీషు వారిని జయించుటకయి నిజాముసలాబత్ జంగు మచిలీబందరునకు 15 మైళ్ళ దూరమువఱకును వచ్చి వారినిజయించుట సాధ్యముకాదని తెలిసికొని 1759 వ సం॥రము మెయి 14 వ తేదీని సంధిచేసికొని మచిలీబందరు సర్కారును కొండవీడు నైజాముపట్టణము సర్కారులును ఇంగ్లీషువారికిచ్చివేసి, ఆనందగజపతిరాజుగారు ఫ్రెంచివారి కియ్యఁబడిన దేశమునుండి గ్రహించిన సొమ్ము విషయమై తగవుపెట్టక విడిచిపెట్టి వారి తండ్రి తాతలనుండి వారనుభవించు చుండిన దేశమును వారనుభవించుట కంగీకరించెను. ఈయొడంబడిక యయిన తరువాత స్వదేశము

వకు వచ్చుచు తోవలో రాజమహేంద్రవరమున నానందగజపతిరాజుగారు స్ఫోటకముచేత కాలధర్మము నొందిరి. అప్పుడా యన భార్యలిద్దఱును సహగమనముచేసిరఁట. తర్వాత బొబ్బిలిలో మృతులయిన విజయరామరాజుగారి భార్యచంద్రయ్యమ్మగారు సన్నిహితజ్ఞాతియైన పూసపాటి రామభద్రరాజుగారి ద్వితీయభార్య పుత్రుఁడైన పండ్రెండు సంవత్సరముల ప్రాయముగల వేంకటపతిరాజను చిన్నవానిని పెంచుకొని ఆచిన్నవాని పేరు విజయరామరాజుగా మార్చి యాయనను పట్టాభిషిక్తుని జేసెను. ఈవిజయరామరాజు బాలుఁడయి నందున రాజ్యాధికారమునంతను సవతి యన్నగారగు సీతారామరాజుగారు వహించి, తమ్మునకు యుక్తవయస్సు వచ్చిన తర్వాత సహితమధికారమునంతను తానే చెల్లించుచువచ్చెను. ఈ విజయరామరాజుగారి కాలములోనే మన కవియుండినది. ఆకాలమునందు విజయనగరమువారు నిజామునకు కట్టుపన్ను రెండులక్షుల తొంబదివేల యేఁబదితొమ్మిది రూపాయిలు అయినను దేశమస్వస్థస్థితిలో నున్నందున నిజాము తనకు రావలసిన కప్పమును తిన్నఁగాఁగైకొన శక్తుఁడు గాక పెక్కేండ్లూరకుండుచు వచ్చెను. ఈహేతువుచేతను, సీతారామరాజుగారు బలవంతులయి తమ సేనలతో చిల్లరసంస్థానాధిపతుల నదిమి కప్పములు గొనుచుండుటచేతను విజయనగర రాజ్యమాకాలము నందించుమించుగా స్వతంత్రరాష్ట్రమువలెనే యుండెను. ఈ సీతారామరాజుగారు బొబ్బిలి

రాజయిన చిన్నరంగారావుగారిని పట్టుకొని విజయనగరములో చెఱసాలయందుంచెను. పర్లాకిమిడి రాజగు నారాయణదేవు జగన్నాథయాత్ర పోవుట సందుచేసికొని యతని రాజ్యముమీద దండెత్తి యాత్రనుండి తిరిగివచ్చిన యాతని నరసన్నపేటవద్ద నోడించి యిప్పటి గంజాము మండలములో విశేషభాగమును విజయనగర రాజ్యములోఁ జేర్చెను. తన తమ్ముని వెంటఁగొని దండయాత్ర వెడలి సీతారామరాజుగారు మొగలితుర్రు వఱకును వచ్చి స్థానికపాలకుఁడయిన నబాబు బక్షీఅబ్దుమాఖానును జయించి కొంతకాలము రాజమహేంద్రవరము సర్కారును సహిత మాక్రమించినట్లు చెప్పుదురు. ఇట్లింకను పెక్కుజయములను బొందిి మహోన్నత దశయందుండిన యీకాలములోనే యింగ్లీషువారు నిజామువలనఁ బొందిన సనదుప్రకారముగా నుత్తర పు సర్కారులలోఁ దమ యధికారమును జెల్లించుట కారంభించిరి. ఇంగ్లీషుకంపెనీ వారితోఁ జేసికొన్న యొడంబడికనుబట్టి సంవత్సరమునకు మూఁడులక్షల రూపాయిలు పేష్కష్ చెల్లించుటకును, పర్లాకిమిడి రాజయిన నారాయణదేవు వలనఁ గైకొన్న రాజ్యమును విడిచిపెట్టుటకును విజయనగరము వారొప్పుకొనిరి. ఇట్లు కొంతకాలము జరిగిన తర్వాత విజయనగరసంస్థానమునకు లోబడియున్న కొండజమీందారు లందఱును విజయనగరము వారిమీఁద తిరుగఁబడి స్వతంత్రులగుటకుఁ బ్రయత్నించిరి.

కాని సీతారామరాజుగా రన్నిటికిని దగినవాఁడై యందున నిఙ్గ్లీ షుసేనలను సహాయ్యపఱుచుకొని యాకొండ సంస్థానాధిపతుల నొక్కొక్కరినే జయించి కొందఱిదేశములను తమరాజ్యములోఁ గలుపుకొనియు కొందఱిని విజయనగరమునఁ జెఱసాలలో బెట్టి యు నందఱిని సాధించెను. ఈకలహములలో ఆండ్రి పాలకొం డజమీన్‌దారులు మాత్రము చేరలేదు. సీతారామరాజుగా రిట్లుపరరాజులను జయించుటయే కాక తురకదొరలు మసీదుల కిచ్చిన భూములను పూర్వరాజులు బ్రాహ్మణుల కిచ్చిన మా న్యములను గూడ లాగుకొని ప్రజలను సహితము క్షోభపెట్ట నారంభించెను. ఈయనపెట్టుబాధలే సూరకవిని రామలింగేశ శతకము చెప్పునట్లు చేసినవి. ”

× × × ×

“ ఇట్లుండఁగా సంస్థానమునందుండిన రాచవాఱందఱు నొకటిగాఁజేరి 1775 వ సంవత్సరమునందు మంత్రిత్వమునుమా ని రాజకార్య సంబంధము వదలుకొను నట్లు సీతారామరాజు గారిని నిర్బంధపఱిచిరి. తన పుత్రుఁడయిన నరసింహగజపతిరాజు ను స్వీకారముచేసికొని విజయరామరాజుగారి మరణానంతరమున సింహాసన మాతనికిచ్చునట్లు తమ్ముని నొడఁబఱిచి యాయన తాను మంత్రిత్వమును విడుచుట కంగీకరించెను. ”

“ విజయనగరము వారు చెల్లింపవలసిన కప్పముయొక్క మొత్తమును నిర్ణయించుటకయి కంపెనీ వారి చెన్నపురి

పరిపాలకుఁడు విజయరామరాజుగారిని చెన్నపురి రమ్మనికోరెను. కోరిన ప్రకారముగా విజయరామరాజుగారు చెన్నపురికిఁబోక ప్రయాణ వ్యయములకు తనచేత సొమ్ములేదనియు, తనయన్న యయిన సీతారామరాజుగారు తన్ను నాశనముచేయుటకయి తంత్రములు పన్నుచుండిన యీకాలములోఁ దాను రాజధానిని విడిచి దూరముగాఁ బోవుట యుచితము కాదనియు, విశాఖపట్టణములోని యధికారుల సమక్షమునఁ దాను వారు విధించెడు న్యాయమైన కప్పమున కంగీకరించెదననియు చెప్పి తప్పించుకొనెను. అంతట చెన్నపురి పరిపాలకుఁడు సీతారామరాజుగారిని చెన్నపురికి రమ్మనికోరఁగానే యతఁడు తక్షణమేపోయి యక్కడివారిని వశపఱుచుకొని, రాజకార్యములు చక్కఁ బఱుచుకొని విజయనగ్గర సంస్థానమునకు తన్ను దివానుగా నేర్పాటుచేయించుకొని తనపుత్త్రుని స్వీకారమునుస్థిరపఱిపించుకొని, మరల వచ్చెను. ఈ యేర్పాటుల వలన విజయరామరాజుగారు పేరునకు రాజుగా నుండినను నిజమైన యధికారమంతయు సీతారామరాజుగారి చేతిలోనే చిక్కెను. ఈ విషయమై విజయరామరాజుగారు కంపెనీవారికి మొఱపెట్టుకొఁగా పెట్టుకొఁగా తుదకు వారాయనను దివాను పనినుండి తొలఁగించి విజయనగరము విడుచునట్లుత్తరువు చేసిరి. అందుపయిని సీతారామరాజుగారు విజయనగరము విడిచి సింహాచలము నివాసముగా నేర్పఱుచుకొని యక్కడ కొంతకాలముండి, తరువాత

మరల తమ్మునిమంచిమాటలాడి 1790 సం॥రమునం దొకసారి యు 1792 సం॥రమునం దొకసారియుమరల సంస్థానములోదివానుగాఁ బ్రవేశించి, కడపటిసారి కంపెనీవారిచే చెన్నపురికిఁబోవునట్లుత్తరువు చేయఁబడి నెలకయిదువేల రూపాయిల యుపకారవేతనము మీఁద 1793 సం॥రము నందక్కడకుపోయి చేరెను. సీతారామరాజుగారి దుష్పరిపాలనము మొదలయిన కారణములచేత విజయరామరాజుగారు ఋణముల పాలగుటయే గాక కంపెనీవారికి కట్టవలసిన కప్పమునుసరిగా కట్టలేక యాఱులక్షల యిరువదియైదువేల రూపాయిలవఱకును బాకిపడిరి. అందుచేత కంపెనీవారు సంస్థానమును తమపాలనమునకుఁ దీసికొని విజయరామరాజుగారిని రాజ్యమునువిడిచి మచిలీబందరులో వాసము చేయునట్లుత్తరువుచేసిఆయనకు ముప్పదివేలరూపాయ లొక్కసారిగా రొక్కమిచ్చెదమనియు నెలకు 1200 రూపాయిలు వ్యయములకిచ్చెద మనియుఁజెప్పిరి. ఆయన స్వదేశమును విడుచుట కిష్టములేని వారయి బందరుపురమునకుఁ బోవు మార్గమునబయలుదేఱి మైదాఱుక్రోసుల దూరము పోయి యక్కడనుండి పరివారముతో వెనుకఁదిరిగి పద్మనాభమునకుఁ బోయి యక్కడనుండి తాను ప్రయాణము చేయలేక పోవుటకు సాకులువ్రాయనారంభించెను. విజయరామరాజుగా రక్కడ నున్నకాలములో శాచవారును నాలుగువేల సైనికులనుబోయి యాయనను

జేరిరి. కంపెనీవారికీసంగతి తెలియఁగానే యిరువదినాలుగుగంటల కాలము గడువిచ్చి యాలోపల నతఁడు బందరు మార్గమున బయిలుదేఱని పక్షమున బలత్కారముగాఁ బంపవలసినదని విశాఖపట్టణములో నున్న సేనానాయకున కుత్తరువుచేసిరి. పయివారి యుత్తరువును దెలియఁబఱిచి యింగ్లీషు సేనాధిపతి యయిన పెండర్గాస్టుగారు కొంతసేన (750 భటుల)తో పద్మనాభమునకుఁబోయిరి. 1794 సంవత్సరము జూలై నెల తే 10 ది యుదయమున నింగ్లీషు సేనాధిపతి పద్మనాభపుకొండనుజేరున ప్పటికి, విజయరామరాజుగారును బంధువులయిన రాచవారును ఖడ్గపాణులయి లోఁబడక యుద్ధముచేసి వీరమరణము నొందుటకు నిశ్చయించుకొని యందఱును పద్మనాభస్వామి ప్రసాదమును స్వీకరించి యుద్ధోన్ముఖులయి నిలిచి యుండిరి. నాఁడు సూర్యోదయకాలమున నింగ్లీషుసేనలకును రాజుగారి సేనలకును ముప్పావుగంటసేపు ఘోరయుద్ధము జరిగినది. అంతట రాజుగారి సేనలన్నియు చెల్లాచెదరయి పాఱిపోయినవి. రణరంగమునకుఁబోయి చూడఁగా రణనిహతులై వీరశయనము నొందినవారి శరీరములక్కడ మున్నూటతొమ్మిది కనఁబడినవి. రణభూమి నలంకరించిన మున్నూటతొమ్మిదింటిలో నిన్నూటయెనుబది రాచవారి దేహములు. రణరంగమధ్యమునఁ బడియుండిన విజయరామరాజుగారి శవము చుట్టునుకోట కట్టినట్లుగా సంస్థానములో నున్నతస్థితిలో నుండిన యుత్తమ క్షత్రియుల శవములు

నలువదిగుండుదెబ్బలతో బడియుండెను. ఇట్లు మరణమునొంది నవారు గాక పాఱిపోయిన వారిలో నెందఱికి గాయములుతగిలి నవో తెలియలేదు. ఇంగ్లీషుసైనికులలో మృతినొందిన వారు పదముగ్గురు, గాయపడిన వారఱువదియొక్కరు. ముప్పదియేండ్ల క్రిందట బొబ్బిలికోట ముందు పెదవిజయరామరాజుగారు హతులైనట్లే, మనకవీంద్రుని కాలములో నుండిన యీచిన విజయరామరాజుగారు పద్మనాభపుకొండ ముందు నిహతులైరి. మన కవి కాలముతో సంబంధించిన చరిత్రమింతే. తండ్రిమరణమును విని యప్పటికెనిమిది సంవత్సరములు ప్రాయము వాఁడైన నారాయణబాబుగారు తల్లితోడ గూడ కొండదేశమునకు పాఱిపోయిరి. కాని కంపెనీ వారాయనను బిలిపించి దొరతనమిచ్చిరి. " (రావుబహదూరు క॥ వీరేశలింగముపంతులుగారు ఆంధ్రకవుల చరిత్రము. తృతీయభాగము పుటలు. 69-75.)

పాఠక మహాశయులారా! రాజులచేతను గవిరాజులచేతను,విలసిల్లిదిగంత విశ్రాంతమగు కీర్తినిగాంచిన శ్రీపూసపాటి మహారాజవంశమును గూర్చి వ్రాయవలెనన్న నొక ప్రత్యేక గ్రంథమగును. అంత విపులముగ నిచట వివరింప నవకాశము లేనివాఁడనై శ్రీవీరేశలింగము పంతులగారి గ్రంథమునందు సంగ్రహముగ వ్రాయబడిన చరిత్రమును గైకొని నిచట నుపయోగపఱచు కొంటిని.

సూరకవి తనగ్రంథముల నన్నిటిని రామచంద్రపురరామలింగేశ్వరున కంకిత మొనర్చెను. గ్రంథములు దేవాంకితములైన కారణముచేతఁ గవి కాలనిర్ణయమునకు సౌకర్యము నియ్యఁజాల కున్నవి. అయినను నితఁడు తనప్రభువులగు విజయనగర పురాధీశులపైఁ జెప్పిన చాటుపద్యముల వలనఁగాల నిర్ణయము చేయుటకు వీలగపడుచున్నది. పూర్వోదాహృతములైన "మెత్తనైనట్టి యరఁటాకు మీఁదఁగాక" అను గీతపద్యమును "ఢిల్లీలోపల గోలుకొండ పురినిండౌ" అను వృత్తమును, క్రీస్తుశకము 1746 సంవత్సరప్రాంతమున * బాదుల్లాఖానునకును మొదటి పెదవిజయరామ మహారాజునకును జరిగిన యుద్ధమును గూర్చి సూరకవి చెప్పియున్నాఁడు. దీనిని బట్టి సూరకవి 1738 మొదలు 1757 వఱకు రాజ్యముచేసిన పెదవిజయరామ మహారాజుగారి కాలమున నున్నాఁడనుట స్పష్టము.

పెదవిజయరామరాజుగారి తర్వాత ఆనందగజపతిమహారాజుగారు రాజ్యమునకు వచ్చి కొలఁది కాలము మాత్రము

---

* "సన్న 1156 ఫసలీ 1746 సంవత్సరములో జాఫరల్లీఖానుడికి అయివజుగా బహాదుల్లాఖానుడు శ్రీకాకుళం సర్కారుకు ప్రవేశించినాఁడు. అదివరకు జాఫరల్లీఖానుడు 6 సంవత్సరములు హాకీంగిరిచేసినాడు. అటు తరువాత బహుదుల్లాఖానుడికిన్ని విజయరామరాజుగారికిన్ని హవేలీపరగణాల నిమిత్తమున్నూ జమాబందీఖణా యించడం నిమిత్తమున్నూ జవాబు సవాలు నిమిత్తమున్నూ లడాయివచ్చి కలహంచేస్తూ యున్నంతలో" (......శ్రీవిజయనగరం సంస్థానం డయిరీమెమోరాండము. 1652—1845.)

రాజ్యముచేసిరి. ఆయన స్వర్గస్థులైన పిదప "చినవిజయరామ మహారాజు"గారు సింహాసనమునకు వచ్చి 1760-1794, వఱకు ను రాజ్యముచేసిరి. ఈమహారాజుగారి కాలముననే మన కవి గారి ప్రభ చాల హెచ్చుగ నుండెను. సూరకవి యీచిన విజ యరామమహారాజుగారి కాలమున నున్నాఁడనుటకు నిదర్శనము లు పెక్కులుగలవు. ఒకటి రెండింటిని మాత్రమిచటఁ జూపు చున్నాఁడను.

శ్రీ వత్సవాయి తిమ్మజగపతి మహారాజుగారి రాజ్య కాలమున 'పెద్దాపురము'లో నొకప్పుడు రాజులందఱు (తమ బంధువర్గములోని, వారును మిత్రమండలిలోని వారును నగు మహారాజులు) సభ చేసి కూర్చుండి యుండఁగా సూరకవి తన ప్రభువును స్తుతించుచు.

ఉ. రాజుకళంకమూర్తి రతి ♦ రాజు శరీరవిహీనుఁడంబికా
రాజు దిగంబరుండు మృగ ♦ రాజుగుహాంతర సీమవర్తి వి
భ్రాజితపూసపా ద్విజయ ♦ రామనృపాలుఁడు రాజుగాక యీ
రాజులు రాజులే పెనుత ♦ రాజులుగాక ధరాతలంబునన్.

అను నీపద్యమును సభాసదులైన రాజులవంకఁ జూచుచుసభిన యముతోఁ జదువనందలి కడపటివాక్యము తమ్ము నుద్దేశించి కవి చెప్పెనని యభిప్రాయపడి మహీపాలురంద ఱొక్కుమ్మడిఁ గోపమును జూప నతఁడించుకేనియు జంకక పద్యార్థమునుచేట

తెల్లముగ విప్పిచెప్పి వారినందఱను శాంతచిత్తులుగఁ జేసెనని ప్రబలమగు నొక వాడుకకలదు. శ్రీవత్సవాయి తిమ్మజగపతి మహారాజులుంగారి రాజ్యకాలము క్రీ॥ వె॥ 1759 మొదలు 1797 వఱకుఁగల కాలమైనందున నీయనకు సమకాలికుఁడు చినవిజయరామ మహారాజనుట స్పష్టము. ఆ కారణము చేత సూరకవి చినవిజయరామ మహారాజుగారి కాలమున నున్న వాఁడని చెప్పుటకేమియు నాక్షేపణములేదు.

ఇంతియ కాక చినవిజయ రామమహారాజునకు సమకాలికుఁడై * శృంగవరపుకోట జమీని బరిపాలించు చుండిన శ్రీముఖి కాశీపతిరాజుగారి రెండవ కుమారుఁడు రాజభూపాల రాజు తన సత్త్వమును, నెదిరి సత్త్వమును దెలియనివాఁడై మిగులఁ బ్రబలులై యున్న విజయనగర పురాధీశులమీఁదికి దాడి

---

(1) * " .........అంతట కాశీపతిరాజుగారి శృంగవరపుకోట మీదికి దండుయెత్తి, మోహిందిగే పర్కువారు లొంగుపాటులో రానందున్న సకల ప్రియత్నాలుచేసి కోట మాత్రింపట్టుకొని రాజ్యం స్వాధీనం తెచ్చుకున్నారు. గన్కువారు కాశీపురం ప్రవేశించి పితూరీచేస్తూ పచ్చినారు. యీకాశీపతిరాజుగార్కి ముగ్గురు కొమాళ్ళు. వారి పేర్లు వీరభద్రిరాజు, వీరముకుంద రాజు, రాజభూపాలరాజు, యీముగ్గిరి కొమాళ్ళతోటివుండగా యింతలో కాశీపతిరాజు వుండగానే పెద్దకుమారుడైన వీరభద్రిరాజు నష్టిపోయినాడు. అంతట కాశీపతిరాజుక్కు బలంతగ్గి శీతారామరాజుగారితోటి బహుదినములు లడాయిచేసిఆయనయున్నూ గతించినాడు. తరువాత వీరముకుంద రాజున్నూ

వెడలి రాఁగనట్టి సాహసకృత్యమును బరిహసించుచు సూరకవి యిట్లొక పద్యమును జెప్పి యున్నాఁడు.

గీ. విజయరామ మహారాజ ♦ పీరుఁజేలు
పట్టములికించె రాజ భూ ♦ పాలరాజు
కడమ మాటలకేమి యీ ♦ కాలమునను
బుట్టెనవ్వేను బులి ♦ గొఱ్ఱెగఱచె.

ఈనిదర్శనము కూడ సూరకవి చినవిజయరామ మహారాజుగారి కాలమున నున్నాఁడనియే నిర్ధారణ చేయుచున్నది.

---

పీర్కిజేరు దస్తులో ర్కాబహు యుద్ధంచేస్తూ యుండగా ఆ సమయమందు శీతారామరాజుగారికి దయవచ్చి వీరి దేశంవదలినాడు జమాబంది విస్తరించి కట్టినందున్ను, తాలూకాలో వారికి మానువర్తి మాత్రంగడిచేది. హానిగాని ఘుజానాగాని చేసేటందుకు ద్రవ్యం మిగిలేదికాదు.'' (పుటలు 15, 16.)

పూసపాటి వారి కైఫీదు.
ఆంధ్రసారస్వత పరిచయములు. 10.
వి॥ ఆర్॥ జగపతిపర్మగారిచే సంపాదితము.

(2) " ......... Like other petty chiefs, the Mukkis were evicted by Vizianagram, but in the general confusion consequent on the sequestration of that Zamindari in 1793 (P. 50), one of the old family, Mukki Rajabhupalaraju, took forcible possession of Kasipuram." (Vizagapatam Gazetteer, Vol. 1. Ch. XV Srungavarapukota Taluk, Page 317).

మీఁదఁజెప్పియున్న ప్రకారము. సూరకవి క్రీ॥శ॥1720వ సంవత్సర ప్రాంతమున జననమొంది యిరువదియైదు సంవత్సరముల ప్రాయమువఱకు రేగలోనుండి పిదప చీపురుపల్లెకుఁ గాఁపురము మార్చి యామరణాంతమచ్చటనే యుండెను. 1794వ సంవత్సరమునఁ బద్మనాభయుద్ధములో వీరస్వర్గమును గాంచిన తన ప్రభువగు రెండవ విజయరామ గజపతి మహారాజులుంగారికంటెఁ దొమ్మిదిపది సంవత్సరములు ముందుగ ననఁగా 1785 సంవత్సర ప్రాంతమున నీకవి వరుఁడు కీర్తిశేషుఁడయ్యెను.



# ఐదవ ప్రకరణము.

## సంస్థానాస్థాన కవి పదము.

సూరకవి తన ప్రభువును విజయనగర సంస్థానాధీశుఁడు నగు చిన విజయరామ మహారాజు నాదరణమును బొంది యాస్థానకవిగానుండెనని ప్రబలమగు నొక వాడుక కలదు గాని యితఁడు విజయనగరమునఁ గాఁపురముండినట్టును నితరులగు నాస్థాన పండితులవలె నిత్యము రాజాస్థానమునకుఁ బోవుచు వచ్చుచుండినట్టును జెప్పుటకు నాధారములంతగఁ గానరావు. ఇతఁడాకాలమున నాస్థానకవి పదమలంకరించి విజయనగరమునఁ గాఁపురముండక చీపురుపల్లె యందే నివసించుచుఁ దఱచు విజయనగరమునకు వచ్చి తన ప్రభువులనుదర్శించుచు నియమితోద్యోగమును నెఱవేర్చు కొనుచునుండెడి వాఁడు.

సూరకవి ప్రజ్ఞావంతుఁడును విద్యాధికుఁడును నై యుండియుఁ దన స్వాముల యెడలఁ జూపవలసిన వినయమును జూపక యొక విధమగు స్వాతంత్ర్యమును గనుపఱచెడి వాఁడు. స్వతంత్రబుద్ధి కలిగియుండుట ప్రశంసనీయమైననుఁ దన యేలికల పట్ల నవిధేయతను జూపునడవడి మాత్రము శ్లాఘాపాత్రము

కానేరదు. ఇట్టి నడవడి యేకవికిఁ దఱచు గలుగుచు వచ్చిన "దేవిడీ మాన్నాల"కుఁ గారణమని చెప్పుదురు. సూరకవి సహజముగ నిట్టి స్వభావము కలవాఁడు కాకపోయినను నప్పటి దివానును రాజుగారి యగ్రజుఁడును నగు సీతారామరాజుగారు కవి యెడలఁ జూపుచువచ్చిన యనాదరణమును నీర్ష్యయుఁ గొంతవఱకుఁ గారణమై యుండవచ్చును. ఈ సీతారామరాజుగారిని గూర్చి కవికృతమగు రామలింగేశ శతకమును విమర్శించు సందర్భమున నిఁకముందు వ్రాయుచున్నాను. కాన నిచట విడచితిని.

ఒకనాఁడు మహారాజు, పండితులు కవులు మొదలగు వారితో నిండుకొలువునఁ గూర్చుండియుండ నప్పటి సందర్భము ననుసరించి సూరకవి యాశుగా.

ఉ. "పంతముననీకుఁ జెల్లు నొక ♦ పాటియమీరుఁడు నీకులక్ష్యమా
కుంతముకేలఁబూని నిను ♦ గొల్వనివాఁడు ధరిత్రిలోన భూ
కాంతుఁడొకండులేఁడు కట ♦ కంబుమొదల్కొని గోలుకొండ ప
ర్యంతము నీవెకా విజయ ♦ రామనరేంద్ర! సురేంద్రవైభవా."

అనియొక పద్యమునుఁజెప్ప దానికిరాజును సభ్యులునుమిగులసంతసించి కవినిబహువిధముల శ్లాఘించిరి; కాని సీతారామరాజుగారు మాత్రమొకయద్భుతమగు నాక్షేపణము చేసిరి. ఎట్లనిన "మండలాధీశ్వరునిగూర్చి నీకుఁజెల్లు; నీకు లక్ష్యమా"

అని యేకవచన ప్రయోగము చేయఁదగునా ? నీవు మహాకవివి యైనను నితరులను మన్నించి నీవు మన్నన గొనవలెను ” అని చెప్ప సూరకవి

* క. చిన్నప్పుడురతికేళిని
నున్నప్పుడు కవితలోన ♦ యుద్ధములోనన్
వన్నెను మీ 'రా' కొట్టుట
చెన్నగునో పూసపాటి ♦ సీతారామా !. అని బదులుచెప్పెను.

సమయోచితమగు నీప్రత్యుత్తరము సభ్యులకు మోదకరమయ్యెను సీతారామరాజుగారికిమాత్రము ఖేదకారియయ్యె. ఇట్టి కారణపరంపరచే నానాఁటికి సూరకవిపై సీతారామరాజుగారికి ననాదరణము హెచ్చుకాఁజొచ్చెను. కవిపెక్కుచోట్లఁదన రామలింగేశ్వర శతకములో సీతారామరాజుగారి చండశాసనత్వమును సూచించుచునేవచ్చెను. మొత్తము మీఁదసూరకవి యొక్క యాస్థానకవి పదము జయప్రదముగను సుఖదాయకముగను వెళ్ళుటలేదు.

---

* శ్లో॥ బాల్యేసుతానాం సురతేంగనానాం ।
స్తుతౌకవీనాం సమరేభటానాం ।
త్వం కారనాదాహిగిరః ప్రశస్తాః ।
కస్తేప్రభో మోహతరస్సృరత్వమ్ ॥

అను నీశ్లోకమును మనమునందుంచుకొని మీఁది పద్యమును జెప్పినట్లుగ నూహింపవచ్చును.

పూర్వోదాహృతమైన " రాజుకళంకమూర్తి " అను పద్యమును 'పెద్దాపురమునందు' సూరకవి చెప్పినప్పుడు మహారాజును మంత్రి మొదలగు నితరోన్నతోద్యోగస్థులును, పద్యముయొక్క సొగసునకెంతయు మెచ్చి కవికిఁ గనకాభిషేకము చేయించిరఁట ; అట్టి యపూర్వ గౌరవమునకు సూరకవి మిక్కిలిగ సంతసించి తనకృతజ్ఞతను బ్రభువునకును, మంత్రియుఁదన బందుగుఁడు నగు బుఱ్ఱా బుచ్చనామాత్యునకును ననేకవిధముల వెల్లడించెను. అభిషేకము చేయఁబడిన బంగారు నాణెములను గవి తప్పక పరిగ్రహించునని మహారాజు లోనగువారు తలంచిరి. కాని సూరకవి మాత్రము వానిని ముట్టఁడయ్యెను. 'పరిగ్రహింపుఁడ'ని చెప్పినపుడు సూరకవి " మహాప్రభూ! ఏలినవారి కటాక్షముచే నింతదనుక స్నానము చేసిన యుదకమును బానముచేయ లేద "నిచెప్ప మహారాజు లోనగువారు సూరకవి నిర్లక్ష్యభావమున కెంతయు నాశ్చర్యపడిరి. విజయరామమహారాజు సూరకవిచెప్పిన సమాధాన మెంతయు యుక్తియుక్తముగ నున్నదని సంతసించి, యతనికివేఱుగ బహుమాన మొసఁగి గౌరవించెను. తాను సుఖముగ జీవయాత్ర గడపఁదగిన యుపపత్తిలేని వాఁడయ్యు ద్రవ్యవిషయమున నిట్టి నిర్లిప్తతను జూపుట యతని స్వతంత్రబుద్ధిని భావదార్ఢ్యమును వెల్లడిచేయుచున్నది.

సీతారామరాజుగారి పట్టెఁగాంచిన విజయరామ మహారాజుగారు సూరకవి ప్రజ్ఞాది విశేషములను బాగుగ గుర్తెఱిఁగి యతని నుచితరీతిని గౌరవించుచు వచ్చిరి. మహారాజుదయమునఁ బాత్రుఁడై సన్నిధివర్తియై మెలఁగుచుండిన పతివాడ పైడన్నయను పేరుగల 'దారూగా' యొక సమయమున సూరకవి యెడల నగౌరవమును జూపెనఁట. దానికి మిగులఁ గుపితుఁడయ్యు సూరన "గోరంతవాఁడైనఁ గొండంత వాఁడైనఁ బగకనర్హుఁడు నృపపార్శ్వవర్తి" (రామలింగేశ శతకము) అను న్యాయము ననుసరించి దాని కేమియుఁ జేయలేక యూరకుండెను. కాని నాఁడు తాను రాజాస్థానమునకుఁ బోయినపుడేదియోసందర్భమున "క॥ ఇత్తడిపుత్తడి యగునా। తొత్తుకు నగలెన్నియున్న దొరసానగునా। యుత్తమకులుఁడౌ నాడా। లత్తింతలభించినను గులాము గులామే ॥" అను పద్యమును రాజుసన్నిధిని జదివి యూరకొనెను. సరసుఁడగు నీవిజయరామ నృపాలుఁడు మీఁది సమాచారమును నెటులో తెలిసికొని సూరకవి, మీఁది పద్యమును దన సన్నిధిని జదువుట కది కారణముణముగాఁ దలంచి 'దారూగా' యగుపతివాడ పైడన్నకు దేవిడీమన్నా యను శిక్షను విధించెను. వాఁడు బుద్ధినెఱిఁగి తన యపరాధమును సూరకవికి నివేదించి క్షమింపుఁడని వేఁడుకొనఁగ సతఁడీక్రింది పద్యమును జెప్పెనని వాడుకగలదు.

గీ. మోటముండకొడుకు ♦ మాటచెల్లిన నాఁడు
నన్ను లక్ష్యపెట్టి ♦ నాఁడుకాఁడు;
తెలిసియిపుడునన్ను ♦ * దీవింపుమనిపల్కెఁ
బట్ట............ ♦ బ్రహ్మవశమె.

ఒకానొకప్పుడు § సత్యవరముజమీందారుల యాస్థానపండితుఁడునుఁ గవియును నగు శేకపల్లి సోమప్పకవి రాజ సమ్మాననమును బొందఁగోరి తనప్రభువుల సిఫార్సుగైకొని విజయనగరమునకు వచ్చి యచ్చటఁ గొన్నిమాసములు నివసించి యుండి ప్రతిదినము నాస్థాన పండితులతోఁబాటు మహారాజు సన్నిధికి వచ్చుచుఁ బోవుచుండెడి వాఁడు. సోమప్పకవి విజయనగరమున నున్న దినములలో సూరన, రాజునుదర్శింప నాస్థానమునకుఁ బోఁగామహారాజును, దివానగు సీతారామరాజుగారును సోమప్పకవితో మన కవికిఁబరిచయము కలుగఁజేసి, యాపండితుని ప్రజ్ఞాది విశేషములను వర్ణించి వానికిఁజెప్పిరి. 'యాచకోయాచకశ్శత్రుః' అను లోకోక్తి సార్థకమగునట్లుగఁ బ్రథమదర్శనముననే సూరకవి సోమకవులకు నొండొరులపై నొకవిధమగు నీర్ష్యజనించెను. ఈ పండితుని మూలమున నెట్లయినను సూరకవిని బరాభవింప సీతారామరాజుగా రుత్సాహపడుచుండిరి. తమ యుత్సాహ, సంకల్పములు వెల్లడియగునట్లుగ సీతారామరాజుగారు సోమప్పకవి జగదేక పండితుఁడనియు, నతని ప్రజ్ఞాది

* పా॥ దీవించమంటాఁడు.

§ ఇది విశాఖపట్టణముజిల్లాలోని అనకాపల్లి సమీపమున నున్నది.

విశేషము లమోఘములనియు, సూరనయెదుటఁ బొగడుటయే గాక యతఁడొక మహాకవీశ్వరుఁడని కూడఁజెప్పుచు వచ్చెను. అంతసూరకవి,సోమప్పకవిని, సీతారామరాజుగారినిగూడఁబరాభూతులుగఁ జేయనెంచి సోమప్పకవిపై నీపద్యములనుజెప్పెను.

గీ. దేవునానమున్న ♦ దేశానకొక కవి
యిప్పుడూరనూర ♦ నింటనింట
నేగురార్గురేడ్గు ♦ రెనమండ్రు తొమ్మండ్రు
పదుగురేసికవులు ♦ భవ్యచరిత.

క. ఏమేమోశాస్త్రింబులు
తామిక్కిలి పఠికనఁటస ♦ తకనీ కవితా
సామర్థ్యమెఱుఁగ నేరని
సోమునిజృంభణము గలదె ♦ సూరునియెదుటన్.

అంత సోమప్పకవి, ప్రత్యుత్తర మియ్యనిచోఁ దనయ శక్తి వ్యక్తమగు నని యెంచి యాశుగా నీక్రింది పద్యమును జెప్పెను.

గీ. సోమశబ్దార్థ మెఱుఁగని ♦ శుంఠవగుట
వదరితివి గాని సూరుని ♦ రదనపాళి
రాలఁదన్నిన సోముని ♦ లీలఁదెలియ
వైతి, నీగుట్టుబఁయలగు ♦ ననుచుఁ గుకవి.

అంతసూరకవి యూరకొనక సోమప్పకవి నుద్దేశించి రెండుపద్యములు చెప్పెను.

క. తెలుఁగున్ గబ్బపురీతులు
కలనెఱుఁగని శుష్కతర్క ♦ కర్కశమతికిన్
తెలిసెనొక యించుకించుక
తెలివలిగాఁ దన్నకృపఁగ ♦ విత్యప్రజాడల్.

క. చెన్నగు నియోగికవనపు
మిన్నా వైదికుని కబ్బి ♦ మిందును జెప్పఁడా
వెన్నమిసి జున్నుకబ్బనె
తన్నుకవచ్చినను గాని ♦ ధరలో నన్నపా॥

వీనికిఁ బ్రత్యుత్తరముగ.

గీ. తర్కకర్కశబుద్ధులై ♦ తగినవారి
కేమసాధ్య? మటంచు నూ ♦ హింపరాదె
తెలుఁగుమాటలు నాల్గయిదు ♦ తెలిసితాము
కవులమనుకొన్న వెటిపాడ ♦ గట్టుమదిని?

అను నీపద్యమును జెప్పి గడుసరియగు సూరకవిని వాగ్యుద్ధమున జయించుట తనకసాధ్యమని ఖిన్నుఁడై సోమప్పకవి సరస్వతినిగూర్చి యిట్లు పలికెను.

క. జిలిబిలిపలుకుల వెలఁదీ!
పలుఁగాకినకారగుళ్ళ ♦ పాలైతిగదే
యిలలో వైదికవిద్యా
తిలకంబుల కేదదిక్కు ♦ తెల్పితివమ్మా.

అంత సూరకవి దీనికిఁ బ్రత్యుత్తరముగ నీక్రింది పద్యముల నుజెప్పెనని వాడుక. వానిలో నొకదాని యభిప్రాయము

మాత్రమిచట వ్రాయుచున్నాను. (పద్యమింత వరకును నాకు లభింపలేదు).

1. "నీకాపురస్థలము తొళ్ళపాలెము, నీ చుట్టములు కల్లూరి వారు, నీయింటిపేరు రేకపల్లివారు, నీవు సోమాహ్వయుఁడవు. ఇట్టి నీవాక్యములెంత వఱకు యుక్తియుక్తములో సభ్యులెఱుంగుదురు గాక."

2. సీ. కట్టెఁడంతవిభూతిఁ ♦ బెట్టి తాతలనాఁటి
కుండనాల్గీనులఁ ♦ గునిసియాడ
మైలగ్రిక్కడు శాలు ♦ మడతలువెరసిన
బోడిబుజ్జలమీఁద ♦ బొసగఁజుట్టి
పాఁతనీరుంగావి ♦ పంచెలును.........ల్
గనుపింపఁగాఁడొల్లు ♦ కప్పుగట్టి
యంగవస్త్రంబుల ♦ నతికి కుట్టినయట్టి
దుప్పట్లుమూఁగప్పి ♦ తుదలుచినిఁగి
నట్టి పుస్తకముల ♦ కట్టలుచంకలోఁ
బెట్టివిషంబులు ♦ విదులుకొనుచుఁ
బలుఁగాకిముండ బి ♦ డ్డలుశిష్యులనికొండ
ఉపచారము ల్సేయు ♦ చుండఁగా స్వ
యంపాక నిష్ఠల ♦ మనివంటసాగించి
పదిదినంబుల కొక్క ♦ పట్టుఁబట్టి
సంగీతసాహిత్య ♦ సరసవిద్యలవారి
పాలిటిభూతాల ♦ పగిదిఁడనరి
యెంతచక్కని శ్లోక ♦ మేనిఁబద్యంబేని
రసమొలుంగకముక్క ♦ రతివహించి

యితఁడుపండితుఁడుగాఁ ♦ డితఁడుతార్కికుఁడుగా
డితఁడుశాబ్దికుఁడుగా ♦ డితఁడుసత్కవి
యారసజ్ఞుండుగాఁ ♦ డనిచుల్కనాడుచు
ఘనవిత్తహరణ దు ♦ ష్కర్మలగుచుఁ
బరఁగుదుష్పండిత ♦ బ్రహ్మరాక్షసులచేఁ
గవితారసజ్ఞత ♦ గట్టువడియెఁ
గాన నేరీతిఁజూచెదో ♦ కరుణమాద్య
శులకవిత్వమేరీతిని ♦ సూటిఁజేసి
రక్షఁజేసెదొ నీవెమా ♦ రక్షకుఁడవు
జానకీరామదేవశా ♦ సారభౌమ.

ఈరీతిగ వీరిరువురకును జనించిన పరస్పరవైరము వీరి యామరణాంత ముండెను. తనకు సూరకవిపైఁగల వైష మ్యమును బ్రతిబింబింపఁ జేయునట్టి పద్యములను సోమప్పకవి తన ప్రబంధమగు "రుక్మవతీపరిణయమునఁ" గృత్యాదిపద్యము లలోఁగుకవి నిందాసందర్భమున వ్రాసి యున్నాఁడు. ఆపద్య ములిందుఁబొందు పఱుపఁబడినవి.

మ. కనవృత్తుల్ గుణముల్ గణింపక యలం ♦ కారంబులున్ రీతులున్
ఘనవాక్యార్థపదార్థ సంగతు లెఱుం ♦ గన్నేరకే యూరకిం
పునఁబ్రాబంధికులైరి కొందఱుకవుల్ ♦ 'పుణ్యైర్యశోలభ్యతే'
యనువాక్యంబు ప్రమాణమయ్యె నిపు ♦ డాహా చిత్రమిద్ధారుణిన్.

చ. వరకవులంచుఁ గొందఱఁట ♦ వారలుసాహితిలేకయే కవీ
శ్వరులఁట వాగ్ధురీకలన ♦ చాలఁగఁ గద్దఁట చిత్రమయ్యెడిన్
వరములొసంగు దైవములు ♦ వాగ్ధురనిచ్చుచు శాస్త్రసంగతిన్
వరమిడలేరె సిగ్గెడలు ♦ వాదులుగాక కవిత్వరీతులే.

సూరకవి కాశ్రియులైన చినవిజయరామ మహారాజు గారు సరసులనియుఁ బండితావలంబకులనియుఁ గవిపోషకులని యు మీఁదఁజూపియుంటిని. వీరుభయభాషల యందునుజక్కని పాండిత్యము గలిగి రెండింటియందును సరసమగు కవిత్వము చెప్పుసామర్థ్యము గలవారై యుండిరి. పెద్దాపురసంస్థానాధిపతు లపయి వీరు చెప్పిన సంస్కృతశ్లోకము నిందుఁ దార్కాణముగ జూపుచున్నాఁడను.

శ్లో॥ అంభోజంకలయన్ సదృశమవనే సాహిత్యరీత్యాం దృశో ।
రామ్రంథాతారమపారసంపది మహాభావే యశోరాశిషు ।
శత్రూణాం పురభంజనే ధృతి గుణేకించోరగేంద్రంమతి ।
ప్రాగల్భ్యేప్రతిభాతి తిమ్మనృపతిః పాకాహితప్రాభవః ॥

ఈ విజయరామ నృపాలుని గూర్చి ప్రశంసించుచుఁ గీర్తిశేషులగు గురజాడ శ్రీరామమూర్తిపంతులుగారు తమకవి జీవితములలో నిట్లు వ్రాసియున్నారు. "ఈరాజశిఖామణి యు ద్ధమందు మడసిన వానికి వీరస్వర్గమున్నదా యని పలికిన వారిం గూర్చి చెప్పిన యొకపద్యము.

ఉ. ఇంచుక సూచివేదన సహింఁ ♦ చినమాత్రనృపాంగనాకు చో
దంచితసౌఖ్యకేళి సత ♦ తంబునుగంచుకె గాంచునెట్లు దు
ర్వంచిత తీవ్రబాణనిక ♦ రక్షతబాహుల కబ్బవేమరు
చ్చంచలలోచనాఘునకు ♦ చ స్తబకవ్యతిషంగ సౌఖ్యముల్.

ఈపద్యంబుచే నీవిజయరామమూర్తి కవియనియు సర సుండనియు నెంచందగియున్నది."

శ్రీరామమూర్తిపంతులుగారు మీఁది పద్యము విజయరామనృపాలుని దని భ్రమపడిరి. కాని యియ్యది జక్కన కవి ప్రణీతమగు విక్రమార్కచరిత్రమునఁ జతుర్థాశ్వాసము నందున్నది. సందర్భానుసారముగ మహారాజీపద్యమును సభయందుఁ జదివియుండవచ్చును. ఉదాహరించుటకుఁ బద్యములు లభ్యము కాలేదు గాని యీమహారాజునకుఁ గవిత్వము చెప్ప సామర్థ్యముండెనని ప్రబలమగు వాడుకమాత్రము కలదు.



# ఆఱవ ప్రకరణము

## దేశాటనము.

సూరకవి సంవత్సరమునకు రమారమి యైదాఱుమాసములు దేశాటనముచేయుచుండెడివాఁడు. ఇతఁడు ప్రతిసంవత్సరము వర్షాశనమునకై పర్లాకిమిడి, పాలకొండ, బొబ్బిలి, చెముడు,శృంగవరపుకోట మొదలగు స్థలములకుఁ బోవు చుండెను. ఒక సమయమున నతఁడు పర్లాకిమిడికిఁబోయి యాసంస్థానమునఁగల రాజకీయోద్యోగుల సాహాయ్యమున రాజునుదర్శింపఁ గోరఁ బండితాదరము లేనియొక ముఖ్యోద్యోగస్థుఁడు రాజుగారిని దర్శింపననిసమయముకాదని సాకులుసెప్పి కవికినాశాభంగము కలుగఁజేసెను. తనకుఁగలిగిన యనాదరణముకారణమున నాపట్టణమున నుండుటకిష్టములేని వాఁడై సూరకవి సమీపగ్రామమునకు నడవిమార్గమునఁ బోవుచుండెను. ఆకాలమున నక్కడి యడవులలోని తోవలకు "జంతు"లని పేరు. ఆజంతు'లలో నొకటి యగు 'రామజంతి'ని గవియిట్లు వర్ణించి యున్నాఁడు.

గీ. తరుశిఖర చుంబితామృతాం ♦ శుస్రవంతి
దళితనక్షత్ర పరి (వృఢ) ♦ తపనకాంతి
సమదవేష్టిత సకలభూ ♦ (జానితాంతి)
ప్రకట ఘీంకృతవనదంతి ♦ "రామజంతి".

ఇది యిట్లుండ సూరకవిరాక రాజునకెట్లో తెలిసెను. అంత నాతఁడు జరిగినదానికెంతయు వగచి సూరకవిని మరలఁ దన పట్టణమునకు రప్పింపనెంచి సవారీతోఁ దనమంత్రిని రామజంతి మార్గమున నంపెను. మంత్రినిర్బంధమును దాఁటఁజాలక సూరకవి పర్లాకిమిడికిఁ దిరుగవచ్చి మహారాజుచే నుచితరీతిని గౌరవింపఁబడి తగిన బహుమానమునందెను. ఆసమయమునఁ గవి యీమహారాజుగారిపైఁ జెప్పిన పద్యములలో లభ్యమైన వానిని నిందుఁబొందు పఱచితిని.

క. గోవిందద్వాదశివలె
చేవచ్చితిరాకరాక ♦ నీనగరికి నో
పావనగుణ నారాయణ
దేవుమహారాజ ! సాహి ♦ తీనవభోజా.

క. నీవిచ్చుభత్యఖర్చొక
భూవల్లభుఁడిచ్చుత్యాగ ♦ మునకెనవచ్చున్
బావనగుణనారాయణ
దేవుమహారాజ ! సాహి ♦ తీనవభోజా.

క. వారిధికిని వారిధియే
మేరునగంబునకు సాటి ♦ మేరునగంబే
నారాయణదేవుకు సరి
నారాయణదేవుగాక ♦ నరపతులెదురా!

ఆకాలమున, పర్లాకిమిడివారికిని విజయనగరము వారికిని బరస్పరవైరము కలిగియుండెడిది. అయినను విజయనగరాస్థాన

కవీశ్వరుఁడగు సూరకవి తమపురమునకు వచ్చినపుడెల్లను, పర్లాకిమిడి ప్రభువులగు నారాయణదేవుగారు వాని నుచితరీతిని గౌరవించి ద్రవ్యరూపమగు బహుమాన మొసంగుచు వారి యౌదార్యమును వెల్లడించుచుండిరి. మీఁది పద్యములు నారాయణదేవు మహారాజు సరసుఁడనియుఁ బండితావలంబకుఁడనియు దానశీలుఁడనియుఁ జాటుచున్నవి.

సూరకవిని వర్షాశన మొసంగి గౌరవించు మన్యపుసంస్థానములలోఁ బర్లాకిమిడి యొకటిగా నుండెను.

ఒకానొకప్పుడు సూరకవి పాలకొండకుఁ బోయియుండెను. ఆకాలమున రామభద్రరాజను పేరుగల యాతఁడు దానిని బాలించుచుండెను. రాజుగారి దర్శనము చేయింపుఁడని మంత్రిలోనగు వారిని జాలదినములు సూరకవి యాశ్రయించెను. ఏకారణముననో సంస్థానమునందలి యున్నతోద్యోగస్థులతని విన్నపమును మన్నింపక, వీనియెడల ననాదరణఁ జూపిరఁట. అంత సూరకవి మిగుల ఖిన్నుఁడును గుపితుఁడును నై యీక్రింది పద్యములను జెప్పెనని వాడుక.

శా. రాజా జారుఁడు మంత్రి నిర్దయుఁడు నీ ♦ రాష్ట్రంబులో పెద్దలా
కోజుల్ కొండలు జీవహింసకును సం ♦ కోచింప రెవ్వారికిన్
దాజీ మీయదు; పాలకొండపురిలో ♦ దాక్షిణ్యశూన్యత్వమీ
ఘాజీపట్టణమేల వచ్చితిని నా ♦ పాపంబు సర్వేశ్వరా.

మ. నరసింగుండును వెంకపాత్రుఁడునుగృ ♦ ష్ణాపాత్రుఁడున్ నాయుఁడున్
శరభాపాత్రుఁడు పాలకొండధరణీ ♦ స్వామిజ్యాధారేయులై
ధరవర్థిల్లెడు రామభద్రనృపునా ♦ స్థానంబునన్ బంచముల్
చిరకాలంబుగ వీరివెంటఁదిరుగన్ ♦ ఛీ! ఛీ! మనం బొప్పునే.

ఇట్లాగ్రామ మందు రవంతయును సమ్మానంబుఁగానక వేఱొక గ్రామంబునకుఁ బోవనుద్యుక్తుఁడై పండితావలంబ కుఁడని ప్రసిద్ధిగన్న యాగ్రామవాసుని దేవాంగుని బత్తుల అ య్యన్నను జూడఁగోరి వగ్గఱ పోగుచుండుసంతకు బట్టలమ్ముకొ నుటకై వెళ్లుచుండిన అయ్యన్ననే “ అయ్యన్న గ్రామమున నున్నాఁడా? లేక సంతకు వెళ్ళినాఁడా? నేనిప్పుడతని యింటికి వెళ్ళినచో నతనిఁజూడఁగలనా?” అని ప్రశ్నించెను. పండిత పక్షపాతియు నుదారశీలుఁడును నగు, అయ్యన్నతన్నుఁ బ్రశ్నిం చిన యతఁడు సూరకవియని తెలిసికొనిన వెంటనే సంతకుఁబో వుటమాని వేఱొక త్రోవను దనయింటికేఁగి సూరకవిరాకకు నిరీక్షించుచుండెను. సూరకవియు, అయ్యన్న యింటికేఁగియత నివలన మంచి సమ్మానమును (అయ్యన్న తాను స్వయముగ నేసినట్టి విలువగల యొక పచ్చలచాపును దాని పొరలయందు పదునారు రూపాయలను నుంచి కవికి బహుమానముగ నొసఁ గెను.) బొంది యానందించినవాఁడై యాతనిపై నీక్రిందిపద్య ములను జెప్పెను.

క. మూఁడేబదు లెవరుండరు
మూఢులు సవిగాన సేయు ♦ ముల్లోకములన్

వాడుకపడవలె మనుజుఁడు
వేడుకతో బత్తులయ్యా ♦ వినఁగదవయ్యా.

క. ఇచ్చెడివానికి ఋణమునఁ
జొచ్చెడివానికిని గాని ♦ సుయచిరకీర్తుల్
వచ్చునె ? యందకి లోభికిఁ
బచ్చని విల్కానివయ్యా ♦ బత్తుల అయ్యా.

గీ. చేనుఁబట్టువేళఁ ♦ జెలఁగియేడ్చును బిడ్డ
యంతకంతసుఖము ♦ నదియొయిచ్చు
నర్థియాడుగువేళ ♦ నదికష్టమనిపించు
ననఘచరిత బత్తు ♦ లయ్యనార్య.

క. ఎత్తెఱుఁగ దూర్లకంబఁడు
సొత్తెదు దుష్ప్రాడజగ్గు ♦ తునకప్రదాతల్
ఉత్తమకవుల నెఱింగిన
బత్తుల యయ్యన్న యీగి ♦ పాటినిజేయర్.

పాలకొండ తాలూకా మిగుల ఫలవంతమైనది. తృణకాష్ఠజల సమృద్ధిఁగలిగి సస్యపూరితములగు కేదారములచే నొప్పియున్న యానాఁటిపాలకొండ జమీని గవి యిట్లు వర్ణించియున్నాఁడు.

శా. క్షేమాకీర్ణాకీర్ణధామములున ♦ శ్రీ జేక్షురంభాటవీ
స్తోమంబుల్ బహుశాలిధాన్య తతులై ♦ చొప్పటన్ నదీమాతృక
గ్రామంబుల్ బహుళాగ్రహారములనే ♦ కంబుల్ ధరన్ జూడఁగా
తామంబన్నదిలేదు శ్రీరగిరిపై ♦ శంబందునెం జేనియున్.

వీరఘట్టమునకుఁ బోవుట.

పాలకొండకు సమీపమున నున్న వీరఘట్టములోఁ బర్వతాలు, అనుపేరుగలపండితమన్యుఁడగు నొక కోమటికవీశ్వరుఁడుండెడివాఁడు. అల్పవిద్యగలవాని కహంభావము మెండను లోకోక్తిసార్థకమగు నట్లుగ నీకోమటి కవి తన కాలములోనున్న కవీశ్వరుల నందఱను హేళనచేయుచు నవమానించు చుండెడివాఁడు. రాజామునకుదగ్గఱగనున్న యిల్లంనాయుమువలస కాపురస్థుఁడగు కొటఱి బాలకవియను నొక యుత్తమ కవీశ్వరు నీపర్వతాలు, అవమానముచేయ దానికాబాలకవియు నతని పక్షమువారగు వీరఘట్టాము కాపురస్థులు కొందఱు బ్రాహ్మణులును గలసి యెట్టులనైన నీవైశ్యకవీశ్వరునకు శృంగభంగము గావింప నెంచి నాఁడు పాలకొండవచ్చి యున్న సూరకవిని దమ గ్రామమునకు రప్పించిరి. తనశక్తియు నెదిరిశక్తి - గుఱ్తెఱుఁగని బర్వతాలు సూరకవి బాలకవిగార్లతోఁ బోటీకి నాశుకవిత్వ ప్రదర్శనము చేయ నొడంబడెను. గ్రామములోని పెద్దలు తగవరులుగాఁ గూర్చుండిరి. నిర్ణీతకాలమగు నొక జాములో బాలకవి సూరకవిగార్లతో సమముగఁబద్యములు చెప్పలేక పర్వతాలు తనయసమర్థతను నొప్పుకొని క్షమింపుఁడని సూరకవికిఁ బాదాక్రాంతుఁడయ్యెను. ఆసందర్భమున సూరకవి చెప్పినపద్య మిట్లున్నది.

గీ. నరుని నొగలమీఁద ♦ హరియున్నచందాన
సూరకవివరేణ్యు ♦ జోగఁగూడు

కొటపత్రి బాలకవియు • కుంభవాస్థాటికిఁ
బర్వతాలుగాఁడు • పారిపోయె.

తన్నవమాన పఱచిన కోమటికవికిఁ దగినట్టుగ గర్వపరి హారమైనందున కెంతయు సంతసించి యాకార్యమునందుఁ దన కు సాహాయ్యపడిన సూరకవిని శ్లాఘించుచు బాలకవి యీ క్రిందిపద్యమును జెప్పియున్నాఁడు.

క. అంతాకవులముగామా
అంతింతో పద్దైమైన • నల్లగలేమా
దంతివి నీతోసమమా
కాంతానుమబాణ! సూర • కవిసెరజాణా.

వీరఘట్టముకుదగ్గఱగనున్న 'వట్టిగెడ్డ'పయి నేలకోసూర కవి యొకపద్యమును జెప్పియున్నాఁడు. ఆపద్యమునందలి యొక పాదము మాత్రము మనకు లభించినది.——"వట్టిగెడ్డకు పదివేల వందనములు"

ఒకప్పుడు సూరకవి బొబ్బిలివెళ్లియుండెను. ఆకాలమున బొబ్బిలికిఁ విజయనగరము వారికిని బొబ్బిలివారికిని బద్ధద్వే బోవుట షముగా నుండినను సూరకవి తమపట్టణమునకు వచ్చినాఁడని వినినతోడనే బొబ్బిలిరాజుగారు తనకిఁ దగిన సదు పాయములనెల్ల జరుపవలయునని తన యుద్యోగస్థులలో నొక రిని నియమించిరి. సూరకవి యిట్లు గౌరవింపఁబడి మరుచటి దిన ము రాజును దర్శింప నాస్థానమునకుం బోయెను. కొండొక సేపు.

రాజుగారు కవితో లోకాభిరామముగ సంభాషించి ప్రసంగవ
శమున విజయనగర ప్రభువులను గూర్చి మిక్కిలి లాఘవముగ
మాటలాడ సూరకవి యట్టి దానికిఁ గొంచెమైనను సహింపకరా
జుగారికి విరసముగఁ బ్రత్యుత్తరమిచ్చి తనప్రభువులయెడలఁదన
కుఁగలవిశ్వాసమును వెల్లడించెను. అంతరాజుగారికిమిగులఁగోప
మురాఁగ సూరకవి సభయందుండ నిష్టములేని వాఁడై వెడలి
పోయెనను నీమొదలగు వింతలు జరిగినట్లుగ నొకవాడుక కలదు.
దీని యథార్థమును స్థిరపఱుప గవికృతములగు చాటుపద్యము
లేవియుఁగానరావు. కాని యొకవిషయము మాత్రము మిక్కిలి
గవ్యాపించి యున్నది. ఆనాఁడు సూరకవి సభవిడిచి బసకువచ్చి
భోజనాది కృత్యములు నిర్వర్తించుకొని రాత్రి రెండు యామ
ములకాలము నిద్రించి వేకువజామున బయలుదేఱి పికారుగంజి
అడవిగుండా స్వస్థలమునకుఁ బోవుచుండెను. అప్పుడచ్చట నా
యుధపాణులగు కొందఱు బోయవాండ్రు కవిని జంపుటకుసంసి
ద్ధులుకాఁగా వారికిభయోత్పాతమగు నట్లు సూరకవి కిరుప్రక్క
ల ధనుష్పాణులగు రామలక్ష్మణులును వారి చెంగట సుగ్రీవాం
జనేయులును నిలిచినట్లుగ వారికిఁగన్పట్టవారందఱు స్మృతిఁదొ
లంగిన వారై కొంత తడవూఱకుండి తెలివివచ్చిన పిదపఁబట్టణ
మునకుఁ బోయి యావార్త పురజనులకు నెఱిఁగింప వారెల్లరా
శ్చర్యమగ్నులయిరఁట ! ఈవిషయమునుస్థిరపఱుప సూరకవికృత
మని వాడుకలోనున్న పద్యమిట్లున్నది.

మ. హనుమంతుం డెదుటన్ దివాకరసుతుం ♦ (డా చెంత) సౌమిత్రియున్
(దను సేవింపఁగ) జానకీవిభుఁడు (వా ♦ త్సల్యంబుతో నిచ్చ) యుం
(పున నన్నెప్పుడు) గాచుచుండగను నీ ♦ బోయాధముల్ కిన్కచే
ననుఁజంపంగలవారె ? రావుకులజ ♦ న్మా! రంగరా (యోత్తమా!)

ఇట్లు బోయలబారి నుండి తప్పించుకొని * మఱునాఁటి జాముప్రొద్దు వేళకు మరడామునకు సమీపముననున్న యొకతోటలో బసచేసి వంటచేసికొని భోజనముచేయుటకు నొక యురఁటాకు నిమ్మని యచ్చటనున్న కూరాకుల మల్లిగాని నడుగ వాఁడాకు నీయక కవిని నిరాకరించెను. అంత సూరకవి కుపితుఁడై “కూరాకుల మల్లిగాఁడు కూలెడు నూతన్” అని తిట్టెను. “సూరకవి తిట్టు కమసాలి సుత్తిపెట్టు” అను దానికి నిదర్శనముగ నేతము తోడుచున్న మల్లిగాఁడు నూతిలోఁ గూలెనఁట! ఇది జరిగి యిప్పటికి రమారమి నూటయేఁబది సంవత్సరములైనను నిప్పటికిని మరడామునకు దగ్గఱనున్న యొక గచ్చునూతికి “సూరన్నగారి నుయ్యి” అని యాప్రాంతమున వాడుక గలిగియున్నట్లు నామిత్రులలో నొకరగు శ్రీ బుద్ధరాజు వేంకటపతిరాజుగారు చెప్పి

* ఈసందర్భముననే కవిగారు “ఆర్తజనరక్షణోపాయ ఆంజనేయ” అను మకుటముతో నూఱుపద్యములు చెప్పినట్లు వాడుక కలదు. వానిలో నెనుబదిపద్యములు గల యొక ప్రాచీనతాళపత్రగ్రంథము తమయొద్ద నున్నదని నా మిత్రులలో నొకరగు మద్దాల సున్నయ్యశాస్త్రి బి. ఎ. గారు చెప్పినారు. కారణాంతరములచే నయ్యది సమయమునకు వారు నాకుఁ బంపఁజాలినవారు కారు. ‘అడిదమువారి చాటువులు’ అను పేరను నేను ప్రకటింపఁబోవు ప్రత్యేకమునందా పద్యములను జేర్పఁగలవాఁడను.

చున్నారు. ఈనూతికి సమీపమున నే నాఁడు సూరకవి బసచేసి యుండెనని తోఁచెడిని. లేనిచో నీనూతికి "సూరన్నగారి నుయ్యి" అను వాడుక కలుగ నేరదు.

ఆ వైపున నున్న పాచిపెంట, చెముడు, శంబరపురము మొదలగు మన్యపుజమీలకు వెళ్ళినప్పుడు చెప్పినపద్యములుగాఁ గన్పడు వానిలోఁ గొన్నిటిని మాత్రమిందుఁ బొందుపఱచుచున్నాను.

* క. అర్బుదములు నిర్బుదములు
బర్బరదేశాధిపతులు ♦ పడిగాపులు నీ
దర్బారువఁ బడియుందురు
దోర్బలసంపన్న! మన్నె ♦ దొరయెరకన్నా.

---

* ఈపద్యము ఆంద్రిమన్నెదొరలపైఁ జెప్పినట్లుగ గనఁబడుచున్నది ఔచిత్యమును బాటింపమికి దీనినిదార్హాణముగ నీయవచ్చును. ఇందుఁ జెప్పఁబడిన యెరకన్న శ్రీమంతుఁడును గృషీవలుఁడునునగు నొకమన్నెదొరగాని కవిగారు వర్ణించినట్లుగ బ్రహ్మాండ నాయకుఁడు మాత్రము గాఁడు.

న్యూనాధిక్యముఁను బాటింపమికి నింకొక తార్హాణమును జూపుచున్నాను. తనకు మంచిగంటమును జేసియిచ్చిన యొక కమసాలిని సూరకవిగారిట్లు వర్ణించియున్నారు.

క. ముల్లోకంబుల నాలుఁగ
వ పరశురాము కీర్తి ♦ ప్రబలివెలుంగున్
మల్లిన్ సుమవల్లిన్ జా
బిల్లిన్, అలపాలవెల్లి ♦ భీష్మనితల్లిన్.

క. ధీరాగ్రణిశివరామ
తామ్రగమణుండేలు చెముడు ♦ శంబరపురమా
పోరామారొంపిల్లా
పారాద్రా మంగరాజా ♦ పాలెముపట్టా.

సీ. చుట్టాలకునుగూడు ♦ పెట్టనిపెనులోభి
బొజ్జతోఁబంచిన ♦ పుణ్యమేమి
కార్యమించుకసేయఁ ♦ గాలేని నీచుండు
రాజసన్నిధినున్న ♦ లాభమేమి
పదిమందిమెచ్చని ♦ పాపకర్మునకు సం
పదవిజృంభించిన ♦ భాగ్యమేమి
ఆశ్రితుఁబ్రోవని ♦ యధముండు పల్లకీ
నెక్కి యూరేగిన ♦ గొప్పయేమి
మాటచెల్లినయెడల స ♦ మస్తబంధు
భూసురాశ్రితజనములఁ ♦ బ్రోవలేని
వాని జన్మంబుకాల్పనా ♦ వసుధలోన
వెంకిలిపురీనివాస ర ♦ విప్రకాశ
శ్రీమదాకాశకేశ యయ ♦ మామహేశ.

## సమస్యాపూరణము.

ఉ. నాగతరప్రబంధముల ♦ సంఖ్యముగా నొనరించునట్టి యీ
నూరకవీంద్రునింజూనిగి ♦ చూతమటంచును మాటిమాటికిన్
ఈనసమెత్తి కృతుల ♦ నిచ్చిన వారలనోరుమొత్తుఁడీ
మీరును మీరుమీరు మఱి ♦ మీరును మీరును మీరలందఱున్.

(ఈపద్యమును బొబ్బిలిలోఁ జెప్పినట్టువాడుక కలదు.)

సూరకవి తఱచు తనబంధువులను జూడఁబోవుచుండెడి వాఁడు. ఒకప్పుడితఁడు చీపురుపల్లి నుండి బయలుదేఱితనబంధువులు బుఱ్ఱావారింట జరుగు నొకశుభకార్యమును జూడ, అదపాకకుఁబోవు చుండెను. (ఈగ్రామము చీపురుపల్లెకు నేడెనిమిది మైళ్ళదూరమున నున్నది.) ఆనాఁడే సూరకవిగారింటికి సమీపమున నివసించు పాపయను పేరుగలయొక సాలిదికూడ నదపాకకు పోవుచుండెను. దారిలో నది సూరకవిని గలియ నతఁడు "పాపా! యెటు వెళ్లెదవే?" అని యడిగెను. "బాబూ! అత్తవారింటికి నదపాక వెళ్లుచున్నాను." అని పాప ప్రత్యుత్తరమిచ్చెను. సర్వకాలసర్వావస్థల యందును పద్యములల్లుటయే వేశంబముగాఁగల మన కవిగారు పాపచెప్పిన మాటలనే యొక కందపద్యపాదములో 'అదపాకా అత్తవారు? ఔనే పాపా! యని తిరుగఁజెప్పిరి. అంత పాప సూరన్న బాబూ! నీకుదండము. నామీఁద నొకపద్యమును గూర్పుము.' అని కోరెను. సూరకవి యాసాలిదాని కోరికను జెల్లింపనెంచి,

* క. అదపాక మామిడాకులు
పొదుపుగ నొకవిస్తరంటఁ ◆ బొడిచినవాఁడే
మొదమొప్ప విక్రమార్కుఁడు ;
అదపాకా అత్తవారు! ◆ ఔనేపాపా.

---

* అమాయకురాలగు సాలిదాని కోర్కె చెల్లింపఁజెప్పిన పద్యమనివాడుకకుఁ దగినట్లుగనే యున్నది. అదపాక మామిడాకులు విస్తరికుట్టుటకుఁదగిన వెడల్పు తేనివి. కవిగారియనుభవము నిచటవెల్లడించియున్నారని చెప్పనగును.

అని పద్యమును బూర్తిఁజేసి యాపాపను సంతోషపెట్టి నట్లువాడుక.

చీపురుపల్లెనుండి స్వగ్రామమగు భూపాలరాజు వేగ వెళ్లినపుడెల్ల సూరకవి తన బంధువులగు రెల్లివలస పాణంగిపల్లి వారిని, భోగాపురము దేవగుప్తాపువారిని జూడఁబోయెడివాఁడు. ఆకాలమున దేవగుప్తాపు రామయ్యగారు భోగాపురమునఁ గరణీకముచేయుచు వ్యవసాయమువలనఁ దనకుఁగావలసిన వానిని బండించుకొని హాయిగఁ గాలక్షేపము చేయుచుండెడి వాఁడు. అతఁడు బాంధవ్యమున మనకవిగారికిమఱఁదియైన కారణమునఁ బరిహాసకముగ నారామయమంత్రి నిట్లువర్ణించి యొకపద్యమునుజెప్పెను.

ఉ. గ్రామము చేతనుండఁ గృషి ♦ కల్పితధాన్యములింట నుండ శ్రీ
రామకటాక్షవీక్షణప ♦ రంపరచే దినమేఁగుచుండ మా
రామయమంత్రి భోజనప ♦ రాక్రమమేమని చెప్పవచ్చునా
సామియెఱుంగుఁ దత్కబళ ♦ చాతురి తాళఫల ప్రమాణముల్.

సూరకవి యొకప్పుడు రెల్లివలస పాణంగిపల్లి వారింటికిఁ బోయి యుండెను. ఏకారణముననో వారింట నతనికిఁ బెందలకడ భోజనము దొరకదయ్యెను. అట్టిదానికి సూరకవి సహింపఁజాలక పాణంగిపల్లివారి భోజనపుటేర్పాటులను బరిహసించుచు నొకపద్యమును జెప్పెను. కాని దానిలో

గీ. వైదికులు గారు నియ్యోగి ♦ వరులుగారు
పనికిమాలిన పాణంగి ♦ పల్లివారు.

అను రెండుపాదములు మాత్రము లభించినవి.

రెయిలు సదుపాయములేని యాదినములలో సూరకవి వ్యయప్రయాసములకు వెనుదీయక కాశీయాత్రకుఁ బోయెను. దివ్యక్షేత్రమగు వారాణసీపురమును బవిత్రమగుగంగా స్రవం తినిదర్శించి తనజన్మము సార్థకమైన దానినిగాఁజేసికొను నాసక్తి యటుండ, సంస్కృత విద్యాప్రచారమునకు నిలయమై ప్రసిద్ధి గాంచిన కాశీపురమును నవద్వీపమును జూచి యాయాస్థలముల యందున్న పండితోత్తములను దర్శింప వలయుననెడి యుత్సాహము తన్నుఁ బురికొల్ప నితఁడుత్తర దేశయాత్ర గావించెను. కాశీనుండి స్వదేశమునకుఁ దిరుగవచ్చుచు మార్గములో నున్న దివ్యక్షేత్రమగు శ్రీజగన్నాథమునకు వచ్చియున్నప్పుడేతనకుఁ బరమ మిత్రుఁడును బోషకుఁడును నగు పొణ్ణుపాటి వేంకటమంత్రి స్వర్గస్థుఁడయ్యెనని విని మిగుల ఖిన్నుఁడై యీశ్లోకపద్యమును జెప్పి యున్నాఁడు.

మ. కరుణాసాగర! పొణ్ణుపాటికులవేం ♦ కటామాత్యుడానున్ వసుం
ధరయందుంచక స్వర్గలోకమునకున్ ♦ దర్శించినావేమి? త
త్సురిఁ గల్పాదులు లేవె యాచకులకున్? ♦ భూయాచకశ్రేణికి
వ్వరు (దిక్కేమిది) మొండిజగ్గఁడవు (కా ♦ వా పెజ్జ్రిమై పల్కుటిన్.)

ఈతీరున సంవత్సరమున కైదాఱునూసములగఁ బైఁగ సూరకవి దేశాటనముచేయుచుఁ గొందువదినము లుచీపుఱపల్లెలో నుండుచు, దేశాటనమువలన సంపాదించిన ధనముచే జీవయాత్రగడపుచు శ్రీరామలింగేశ్వరుని సన్నిధానమున గ్రంథ రచనచేయుచు నుండెడివాఁడు.

# ఏడవ ప్రకరణము.

## కవి కాశ్రయుఁడైన పొణ్ణుపాటి వేంకటమంత్రి.

18 వ శతాబ్దమధ్యమున శృంగవరపుకోట జమీాని బరి పాలించు చుండిన శ్రీముఖి కాశీపతిరాజుగారికి నీపొణ్ణుపాటి వేంకటమంత్రి మంత్రిగానుండెను. ఇతఁడు గోలుకొండ వ్యాపారి శాఖలోఁ జేరిన బ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. నీరరాజా మాత్యపుత్రుఁడు. ఈమహనీయుని వితరణాది గుణము లెంత యుత్కృష్టములో కాని, యతనిని నుతించినట్లు తనయేలికలగు విజయనగర పురాధీశులనుగాని మఱి యితర రాజులను గాని సూరకవి పొగడియుండలేదు. ఇతనిపై సూరకవిచెప్పిన పద్యములు పెక్కులుగలవు. వానిలోఁ గొన్నిటిని మాత్రమే యిచట వ్రాయు చున్నాఁడను.

క. వర దానాచారంబుల
గరిమగనివనీపకులును • గర్మఠులును భూ
సురమణి యని నిన్నందురు
విరచితకృప ! పొణ్ణుపాటి • వేంకటమంత్రీ.

క. లేఁడు భువివానఁ బడయని
వాఁడున్నియుంట భుక్తి • వడయనిద్విజుఁడుణా

బోడిమి మీఱఁగనిస్సున్
వేఁడనికవి పొన్నపాటి ♦ వేంకటమంత్రి.

క. చుక్కలవలెఁ గర్పూరపు
ముక్కలవలె నీదుకీర్తి ♦ ముల్లోకములన్
గ్రిక్కిరిసి పిక్కటిల్లెను
వెక్కసముగఁ బొన్నపాటి ♦ వేంకటమంత్రీ.

క. సరివత్తురె గుణసంపద
వెఱనక మా పొన్నపాటి ♦ వేంకటపతికా
ర్గురుచక్రవర్తులుఁ బదా
ర్గురు రాజులు ముప్పదిద్ద ♦ రునియోగివరుల్.

మీఁది పద్యములయందుఁ గల వర్ణనమతిశయోక్త్యలంకార భూయిష్ఠమైనట్లుగఁ గానఁ బడుచున్నను నీమంత్రిప్రభుం గవున కీప్రాంతమునఁగల కీర్తిమాత్ర మద్దానిని స్వభావోక్తి యనియే చాటుచున్నది.

తనకు సూరకవి యాశ్రితుఁడైనను వేంకటమంత్రిమాత్రమాతని యెడలఁ బోష్యపోషక భావముచూపక యతనిఁదన నెచ్చెలిగ యోజించి తనబంధువుల కంటె నెక్కుడుగ గౌరవించుచువచ్చెను. సంవత్సరమునకు మూఁడు నాలుగుమాసములు శృంగవరపుకోటలో మంత్రిగారి యింటనే యుండు చుండెడివాఁడు. ఆయాసమయముల యందు వేంకటమంత్రిగారి సన్నిధిని విద్వద్గోష్ఠిగను లోకాభిరామముగను జరుగు ప్రసంగముల

సందర్భముననే సూరకవి "ప్రాణ్గుపాటి వేంకటమంత్రి" అను మకుటముతో గనే పద్యములను జెప్పియున్నాఁడు. ఈపద్యములనే యిటీవల వారెవరో యేర్చికూర్చి వానికి వేంకటమంత్రి శతకమని పేరిడిరిగాని వాస్తవముగ నయ్యవి కవిచేఁ బ్రస్తావనగఁ జెప్పఁబడినవేగాని శతకరూపమున రచింపఁబడినవికావు. ఇందులకుఁ దార్కాణముగఁ గొన్నిపద్యములతో సంబంధించియున్న వింతకథలను నిచట వ్రాయు చున్నాఁడను.

1 ఒకసమయమున శృంగవరపుకోట జమీందారులగు శ్రీముఖికాశీపతిరావుగారి గృహమున నేదియో యొక శుభకార్యము వైభవముతో జరుగుచుండ సమీపగ్రామములలో నున్న బ్రాహ్మణులు సంభావనలఁ గైకొనుటకు శృంగవరపుకోటవచ్చి యుండిరి. సంభావనలిచ్చుటకుఁ బూర్వము బ్రాహ్మణుల నందఱను దొడ్డిపెట్టిరి. ప్రమాదవశమున సూరకవి కూడ దొడ్డిపెట్టఁబడి రెండుయామములు మించు వఱకచ్చటనే యుండవలసివచ్చెను. తాను సూరకవియని పలుమాఱు బంట్రౌతులకు జెప్పి విడుపుఁడన్నను వారితనిని విడువరయిరి. సంభావనలనదుకొను బ్రాహ్మణులతోఁబాటు కొంతసేపునకు సూరకవి సంభావన లిచ్చుచున్న వేంకటమంత్రిగారి యెదుటఁబడ నతఁడు "భావగారూ! మీరేల దొడ్డిపెట్టఁబడిరి? ఇంతవఱకును భోజనములేక యుంటిరా? అపరాధము క్షమింపుఁడు. అచటనున్న

బంట్రౌతులకుఁ దెలిసినది కాదు" అని జరిగినదానికి వగచు చుండ సూరకవి.

1. క. బలవంతుఁడు బలహీనుఁడు
పాలతురు విధితప్ప, నల్ల ♦ పూసలుముత్యాల్
తోలఁగుఁగద మగఁడుపోయిన
వెలదుకకున్ బొగ్గుపాటి ♦ వేంకటమంత్రీ.

అనియొక పద్యమునుజెప్పెను.

2. మఱియొకప్పుడు వేంకటమంత్రిగారి యింట జరిగిన యొక బ్రాహ్మణ సమారాధన కొఱకు సమకూర్పఁబడిన వస్తుస మృద్ధిని వర్ణించుచు సూరకవి యొక పద్యమును జెప్పియున్నాఁడు——

క. ఒక్కసముద్రము దక్కఁగఁ
దక్కినసంద్రములునీయు ♦ దారమహిమచేఁ
జిక్కఁగద! విప్రభుక్తికి
వెక్కసముగఁ బొగ్గుపాటి ♦ వేంకటమంత్రీ.

వడ్డనచేయు చున్న వేంకటమంత్రిగారి సోదరి యీపద్యమును విని సూరకవితో " భావగారూ! (వెంకటమంత్రియు సూరకవియు నొకరి నొకరు 'భావగారు'అని పిలుచుకొనుచుండెడివారఁట.) మీబోటి స్వయంపాక నియమముగల వారలకు దక్కటి సముద్రము విడిచినారము "అనిచెప్ప సూరకవి యేమి

యుఁబ్రత్యుత్తరముగఁ జెప్పలేకపోయెను. అంతనచ్చట భోజనమునుజేయు చున్నవారంద ఱామె సమయస్ఫూర్తిగఁ జేసిన పరియాచకమున కెంతయు సంతసించిరి.

ఇటులనే యీపద్యములలోఁ గొన్నిటికి గాథలుకలవు. ఆ కారణముచేత నీపద్యములు ప్రస్తావవశముగఁ జెప్పబడిన వని యూహించుట యుక్తమని నాకుఁదోఁచెడిని.

ఆఱవప్రకరణమునం దుదహరింపఁ బడిన

మ. కరుణాసాగర ! పొణ్ణుపాటికల వేం ♦ కట్రామదాను న్వసుం
ధరయందుంచక స్వర్గలోకమునకున్ ♦ దర్శించినావేమి ? త
త్పురిఁగల్పాదులు లేవె యాచకులకున్ ♦ భూయాచకశ్రేణికె
వ్వరు(దిక్కీమిది) ? మొండిజగ్గఁడవుఁగా ♦ వా ? వెఱ్ఱివైపల్కితిన్.

అను నీపద్యము వేంకటమంత్రి స్వర్గస్థుఁడైన పిదపఁగవిచేఁజెప్పఁబడినది. ఇయ్యది యామంత్రివరుని యెడలఁ గవికిఁగల గౌరవాతిశయమును దేటపఱచుటయే గాక యాతని వితరణాది సుగుణసంపదనుగూడ విశదపఱచు చున్నది. కారణజన్ముఁడని చెప్పఁదగిన యీమంత్రి శిఖామణి క్రీ॥శ॥ 1780 సంవత్సరప్రాంతమునఁ గీర్తిశేషుఁడై యుండవచ్చును.



# ఎనిమిదవ ప్రకరణము

---

## శాపానుగ్రహసమర్థత.

---

చ. గడియకు నూఱుపద్యములు ♦ గంటములేక రచింతుఁదిట్టఁగా
వాఁడఁగితిపా ఘటాలుమని ♦ తూలిపడున్ కులశైలరాజముల్
విడువకనుగ్రహించి నిరు ♦ పేదధనాధిపతుల్గఁజేతునే
వడిదమువాఁడ సూరన ప ♦ యూఖ్యుఁడ వాక్శరీరంబు వాటియే.

సూరకవి చాటుధార.

పదునెనిమిదవ శతాబ్దమునఁ బ్రౌఢప్రబంధ రచనకుఁ బ్రసిద్ధికెక్కిన కవీశ్వరులలో నొకఁడనియు, లాక్షణికుఁడనియు, సూరకవికిఁగల ప్రసిద్ధి యటుండ నతనికిఁదిట్టు కవిత్వమునఁగూడ గొప్పపేరు వచ్చినది. “సూరకవితిట్టు కమనాలిసుత్తిపెట్టు” అని లోకమున నిలిచియున్న పలుకులే మీఁది యంశమును వేనోళ్ళఁ జాటుచున్నది. అంతియగాక పిండిప్రోలు లక్ష్మణకవి తన “లంకావిజయము”న.

క. “తెలియ విపరాదు కవ్యా
దులు సూరకవి ప్రముఖప్ర ♦ ధుప్రాభవం
తులు భీమశ్రీనాథుల్
వెలయఁగ నాకరణిఁ దిట్టఁ ♦ జేయూఁధమతిన్.”

అనితిట్టు కవిత్వమునకుఁ బ్రసిద్ధికెక్కిన ప్రాచీన కవివరులతో పాటు సూరకవినిఁ గూడఁ బేర్కొని యున్నాఁడు. శాపానుగ్రహముల రెంటిలోను మొదటి దానికిఁగల నిదర్శనములు రెండవ దాని కుండినట్టుగ నీకవివరుని జీవితము ననుసరించి చెప్పుటకు నాధారములుఁ గానరానందున వేములవాడ భీమకవి మొదలగు ప్రాచీనకవులవలె మొక్కటఁ దిట్టుటయుఁ బిదపననుగ్రహించుట యు నీతని వల్లలేదేమో యని తోఁచెడిని. కాని తపఃప్రభావ సంపన్నుఁడగు నీతనికి నట్టి ప్రభావముండిన నుండవచ్చునని " వినుకనను గ్రహించి నిరుపేదను నాధిపు తుల్యుఁజేతు "వను వాక్యము సందియమును గలిగించుచున్నది. సూరకవి నిండు జవ్వనమున నుండి కవితాసామర్థ్యముచేఁ దనకీర్తి చంద్రికల దేశమునందు వ్యాపింపఁజేయుకాలముననే యడిదము రామకవి తన వాక్పటిమచే గంగాభవానిని నోడించి యీయడిదము వంశమునకు నొకయద్భుతమగు కీర్తిఁదెచ్చెను. అట్టికీర్తికొలఁది దినములలోనే, కవితావృత్తిచే నెల్లెడలఁ బేరు వడయుచున్న సూరకవి నాశ్రయించిన దాయెను. సహజమగు తన సామర్థ్యమునకునిది తోడుగాఁగ నీతనికిఁ దిట్టుకవిత్వవిషయమునఁగీర్తి హెచ్చు కాఁజొచ్చెను. పేయేల! ఆకాలమున నీతని యెడల జనసామాన్యమునకు భక్తికంటె భయమెయెక్కుడుగనుండెను. సూరకవి తిట్టు కవిత్వముతో సంబంధించిన కొన్ని ముచ్చటల నిచ్చటఁ జెప్పుచున్నాఁడను.

1. ఒకానొకప్పుడు, ఆళ్ళ సరవయ్యయను పేరుగలయొక కోమటి యింట వివాహముజరిగెను. కవితా సంభావనను గైకొనుటకయి సూరకవి యాకోమటి యింటికిఁబోయి యుండెను. అంత గృహయజమానుఁడు సరవయ్య "బాబూ! సూరకవి గారూ! రేపటి యుదయమున దయచెయ్యండి. కట్నము దాఖలు చేసుకుంటాను." అనియెను. సరవయ్యకోరిక చొప్పున మఱునాఁటి యుదయమున స్నానసంధ్యాద్యనుష్ఠానములు నిర్వర్తించుకొని సూరకవి వాని యింటికిఁ బోయెను. "బుద్ధిః కర్మానుసారిణీ" యనునట్లు సరవయ్య "వీణ్ణి పొంగర; బాపనాఁడు దాచపెట్టినట్టు పొద్దుటే పారొచ్చేడు" అని సూరకవిని దిట్టెను. ఆపరుషోక్తులు విని సూరన మిగులఁగుపితుఁడై "ఆపామే నిన్నుఁగఱవ అయ్యో సరవా!" అని శపించెను. తిట్టుటయె తడవుగ నొక కృష్ణసర్పమింటి ముంజూరు దూలమునఁ జేయానుకొనియున్న సరవయ్యను బొడిచి విగత ప్రాణునిజేసెను. అట్టి యద్భుతమున కచ్చటనున్న వారందఱు కలవరపడి చేష్టదక్కి యుండిరి. ఆ సర్పము మాత్ర మచ్చటనున్న వారల నెవ్వరి నేమియుఁజేయక తన దారిని బైటకుఁబోయెనఁట!

2. ఒకప్పుడు సూరకవి చీపురుపల్లినుండి శృంగవరపుకోటకుఁ బోవుచుండెను. మార్గమధ్యముననున్న ద్వారపూడియను గ్రామమునకుఁ బోయి నాలుగైదు యిండ్లకడఁ దాగుటకుమజ్జిగ నడిగెను. అది యెట్టిపాపమో గాని యొట్టుఁబెట్టినట్టు కవికిఁ

జల్లబొట్టు దొరకదయ్యెను. తానేఁగిన యిండ్లకడఁ బాడియుండి యుఁదనకు వార లీయనందులకు వగచి "దూరమైపోమెరా పాడి ద్వారపుగాడి" యని యొక శాపవాక్యమును పలికెనఁట." దీనికిఁదగినట్టుగ నాఁటిసాయంకాల మాగృహదారిండ్లకడ నావులు గంటెఁడు పాలైన నియ్యలేదఁట! గృహయజమాను లట్టివింత కు సూరకవి శాపమే కారణమని యెంచి క్షమింపుమని సూరకవి ని వేఁడుకొన యథాప్రకారముగ మఱునాఁటి నుండియునావులు పాలిచ్చు చుండెనఁట! (ఈవింతను సూరకవి శాపానుగ్రహ ములు రెంటికిని దార్కాణముగఁ జెప్పినను జెప్పవచ్చును.)

3. సూరకవికి 'చీపురుపల్లె' యందుఁ గొందఱు శిష్యు లుండిరని మూఁడవ ప్రకరణముననే వ్రాసియున్నాను. ఆ విష యమునుఁ దెలియఁజేయుపద్యములోని కడపటి పాదమిట్లున్నది. "ధీరుఁడై నిలిచె మురపాక సూరఁడొకఁడు" ఒక్క మురపాక సూరన మాత్రము తన శిష్యులలో నుత్తముఁడనియు, స్థిరముగ విద్యగరచెననియుఁ గవిగారి యభిప్రాయమై యుండ దైవమీ పద్య పాదార్థమును వేఱుగ గ్రహించుటచే మురపాక సూరన్న గారి సోదరులు నలువురలోను నతఁడు మాత్రము మిగిలి తక్కి నవారు స్వర్గస్థులైరట! (ఈపద్యమును జెప్పుటలోఁ గవియుద్దేశ ము జరిగినదానికి భిన్నముగ నుండినను బదములగూర్పుచే నొక విపరీతమగు నర్థము గలిగెననియు దాని పర్యవసానముగనట్లు జరిగెననియుఁ జెప్పుదురు.)

ఇట్టి వింతలింకను నీకవిఁగూర్చి పెక్కులు చెప్పుదురు గాని యవి యెంతవఱకు విస్రంభపాత్రములో చెప్పఁజాలను. ఏది యెట్లున్నను సూరకవికి మాత్రము తిట్టుకవిత్వమునఁ బ్రఖ్యాతి కలిగి యుండెనని చెప్పుటకు సందియములేదు.

'గడియకు నూఱుపద్యములు గంటములేక రచింతు' అను వాక్యమును బట్టి సూరకవికి నాశుకవిత్వమున గొప్పసామర్థ్యముండెనని మనమూహింపవచ్చును. 'దేశాటనము' (ఆఱవప్రకరణము) కిందనియ్యఁబడిన వీరఘట్టాము వృత్తాంత మాతని యాశుకవితా సామర్థ్యమును వెల్లడిచేయుచున్నది. ఇంతియ గాక శతసంఖ్యాకములై యాంధ్రదేశమున నిలిచియున్న యీ కవివరుని చాటుపద్యరత్నములు గూడ నద్దానికి సాక్ష్యమిచ్చుచున్నవని నాయభిప్రాయము.



# తొమ్మిదవ ప్రకరణము.

## చెఱువుమీఁదిపద్యములు.

(కృతికర్త అడిదము రామకవి.)

ఈపద్యములు సూరకవి ప్రణీతమని సామాన్యమగువాడుక. కాని యియ్యది మాకుటుంబములోఁ బారంపర్యముగ వచ్చుచున్న వాడుకకు విరుద్ధము. కాఁబట్టి పద్యముల కర్తృత్వమును గొంతవఱకుఁ జర్చించి యందలి సత్యాసత్యములు పాఠకమహాశయులకు విశదపఱచెదను.

ఈ వంశజులచే మూలపురుషుఁడుగ నెన్నఁబడు నడిదము నారప్పకు * శ్రీవిజయనగర సంస్థాన ప్రభువులలో నొకరగు కృష్ణమరాజు మహారాజులుంగారు రేగయను గ్రామమునఁ గరణికము చేయుటకుఁ గొంతమాన్యమును దయచేసిరి.

* "యీయినాం సుమారు 300 సంవత్సరములక్రిందటన్నదుదార్కు (అడిదం నారప్పకు) మజ్కూరు మిరాశీపని చూడగలందులకు శ్రీయర్ర కృష్ణందేవు శ్రీనల్లకృష్ణందేవు మహారాజులుంగార్లు మజ్కూరులో కొంతమాన్యం దయచేయించినారు" మహారాజశ్రీ జి. యస్. టయలరు యస్క్వయరుదొరవారి యినాముల దరియాప్తులో చేరిన విశాఖపట్నంజిల్లా యిలాకా వియనగరం సమస్థానం బాపతు భీమునిపట్నం సబుమేజస్ట్రీటు యిలాకా అన్నమరాజు రేగ మిరాశీదార్లు అడిదం నారాయణప్ప సన్యాసిరాజు వగైరాలు దాఖలుచేసిన స్టేటుమెంటు. సన్ ౧౨౭౭ ఫసలీ ౧౮౬౭ సంవత్సరం.

ఈశ్వరానుగ్రహముచే నయ్యది నేఁటివఱకు నీవంశజుల యనుభవములోనే యున్నది. వారిలో నొకకుటుంబము వారు రేగలోనే నివసించుచుఁ గరణికము నేఁడును జేయుచున్నారు. ఆకుటుంబమువారిలో నొకఁడగురామకవియే యీపద్యములనుజెప్పెను.

అడిదమువారి యినాము భూములు "అనుములచెఱు"వనునొక చెఱువు క్రిందనున్నవి. ఈ యినాముభూముల మళ్ళలోఁగొన్నిటిన త్తి నోములచెఱువను నింకొక చెఱువు గలదు. ఈ నోములచెఱువు పూర్తిగ నిండినపుడు మిరాశీ యినాము భూములలోఁ గొన్నిమళ్ళకు ముంపుగలుగును. ఆ నాఁటికాలమున నీరెండవ చెఱువు పూర్తిగా నిండియుండ రామకవి మొదలగు వారి భూములకు ముంపువలన సస్యనష్టము గలిగెను. అంత రామకవి రేగగ్రామముగు త్తదారగు దంతులూరు, అన్నమరాజుగారితోఁ దనకుఁ గలిగిన నష్టమును గూర్చి చెప్పికొని నీటిముంపుతీయింపుఁడని యతనినివేఁడుకొనెను. కానిఅన్నమరాజుగారు రామకవి ప్రార్థనలను బెడచెవినిఁబెట్టిరి. కవికిఁగలిగిన బాధతొలఁగసాధనములేకుండెను. అంతరామకవి యీసమాచారమంతయుఁ దన యేలికయగు శ్రీవిజయరామ గజపతిమహారాజునకుఁ దెల్పుప నిశ్చయించుకొని యొక యర్జీని పద్యములతో వ్రాసి యామహారాజునకుఁ బంపుకొనెను. ఆపద్యములకే యర్జీపద్యములని వాడుక. అవియిందుఁ బొందుపఱచుచున్నాఁడను.

సీ. అవధారు! దేవ! మ ♦ హాపరిభూ ! విన్నపం
బాశ్రితోత్తముఁడ శు ♦ ద్ధాంధ్రకవిని
పేరరామన యింటి ♦ పేరడిదమునారు
మాజాగభూపాల ♦ రాజు రేగ
నల్లకృష్ణక్షమా ♦ నాయకాగ్రేసరుం
డెఱ్ఱకృష్ణక్ష్మాత ♦ లేందు్రలచటఁ
గరణికధర్మంబు ♦ గల్పించి మాన్యంబు
దయచేసి రది యాస్ప ♦ దంబు మాకు

గీ. నదియు నీయేఁడు దంతులూ ♦ రన్ననృపతి
సత్తముఁడు గ్రామ * మెల్లను ♦ గుత్తచేసి
చెఱువు బిగఁగట్టి పరిజలుజే ♦ జేపడంగ
ముంపుగట్టించె వరిపొట్ట ♦ ముంపఁదలఁచి.

సీ. విన్నవించెద నాదు ♦ వృత్తాంత మది కొంత
చిత్తగింపు పరాకు ♦ సేయకుండఁ
బాలములో నొకఁడేరు ♦ పూన్పంగఁ జాలఁడు
గంగాభవానిధా ♦ కసను జడిసి
దుక్కిటెడ్లను గొని ♦ దున్నుకొంద మటన్న
బన్ధులియ్యఁ డెవ్వఁడు ♦ పాఁత నేబు
ఏజోలియును లేక ♦ యింటనుండెద మన్న
సాలఁకు వచ్చుగం ♦ టాలపన్ను

గీ. ‡ దేశమునవాదు పొన్నూరు ♦ తెన్నుగాదు
పంట పసలేదు గంటాల ♦ పన్ను పోదు
మీకు దయరాదు మనుపటి ♦ మిసిమిలేదు
అతులగుణదీప విజయ రా ♦ మావనీప.

---

* పా॥ నోముఫాలముఁదా

‡ పా॥ దేశనిసబత్తు.

మహారాజునకుఁ బద్యరూపమగునీయర్జీ పంపుకొనినను గార్యము లేకపోయెను. గుత్తదారుఁడగు అన్నమరాజుగారి వల నఁగాని తన ప్రభువులగు విజయనగరాధీశులవలనఁ గాని తన కుఁగలిగిన బాధతొలఁగ కుండుటచేత వేఱొండు చేయునది లేక యొక నాఁటియుదయమున రామన స్నానసంధ్యానుష్ఠానములు నిర్వర్తించుకొని తాటాకులు గంటముచేత నిడుకొని పొలము నకుఁ బోయెను. నీటిముంపుచేతఁ జెడుచున్న సస్యమును జూచి విచారించి తన బాధతొలఁగుటకుఁ దన కవితయే శరణమని యెంచుకొని కుత్తుకబంటి నీటిలో నిలువఁబడి గంగాభవానిని నుతించుచు నిట్లొకపద్యమునువ్రాసి వ్రాసిన తాటియాకును నీటి లోవిడిచెను.

సీ. బ్రహ్మాండభాండసం ♦ పత్తి కుక్షిని గల్గు
పద్మనాభుని పదా ♦ బ్జమునఁ బుట్టి
సకలరత్నాకర ♦ స్థానమై యుప్పొంగు
వరిబుధీశునిచర ♦ ణంబు ద్రొక్కి
పరమతత్త్వజ్ఞుఁడై ♦ పరఁగుశంతను మహీ
రమణువామాంకభా ♦ గమునఁజేరి
యఖిలలోకాధ్యక్షుఁ ♦ డై మించి విహరించు
శివుజటాజూటాగ్ర ♦ సీమ నిలిచి
తనరునీవంటిధన్య కు ♦ త్తమము గాదు
పూనపాటిమహాస్థాన ♦ భూమియందుఁ
గాలు ద్రొక్కంగ నోడుఁజం ♦ డాలుఁడయినఁ
గదలు మిటమాని దివిజగం ♦ గాభవాని.

ఇట్టి భూషణవాక్యముల చేతఁ దన సంకల్ప మీడేరమిం జూచి రామన కుపితుఁడై యీక్రింది రీతిని గంగనుదూషించుచు నాలుగుపద్యములను జెప్పెను.

సీ. ఆదిభిక్షుం డీతఁ ♦ డని రోసి విడియాకుఁ
గొనివచ్చి యిట నిల్వఁ ♦ గోరితో కో
జగడాలచీలి వై ♦ సవతితోఁ బోరాడి
యీగి వచ్చిచ్చోట ♦ డాఁగితో కో
నిర్జరాంగనలెల్ల ♦ నీలంకు వెలిపుచ్చ
దూబవై యిచ్చోటఁ ♦ దూఱితో కో
బీదబాఁపలఁ గష్ట ♦ పెట్టుటకై మిన్ను
దొలఁగి యిచ్చోటను ♦ నిలిచితో కో
వలదు ద్విజభూమి కాల్నిల్వ ♦ వరుసగాదు
రవ్వ నీకేల తగదంబు ♦ రాశి కరుగు
నాతి ! యతఁడు కాఁడటె పిన్న ♦ నాఁటిమగఁడు
కదలు మిట మాని దివిజగం ♦ గాభవాని.

సీ. భావింప నిలువెల్ల ♦ భంగంబులే కాని
భంగము ల్తొలఁగు టె ♦ ప్పటికి లేదు
తిరుగుచో వంకర ♦ తిరుగు టింతియకాని
తిన్నఁగాఁ దిరుగుట ♦ యెన్నఁడెఱుఁగ
మొనసి రేయిఁబగల్లు ♦ మొరయుచుండుటె కాని
మొరయ కూరకయుండు ♦ టెఱుఁగ మెపుడు
పాలకల్మి నిరోసి ♦ పల్చనగుటె కాని
పలుచనిగతి మాని ♦ మెలఁగు టెఱుఁగ
మనుచు నీలోన నీవైన ♦ యవగుణంబు
లరసి లజ్జించి దివినుండ ♦ కరుగుటెంచి

నిలువు నీరైననీవిందు ♦ నిలిచితో కో
కదలు మిట మాని దివిజగం ♦ గాభవాని.

సీ. పచ్చిమాంసము కల్లు ♦ భక్షించి మత్తెక్కి
రాణించు తిరుగుప ♦ రాంనులైన
గంజాయి గుండ హు ♦ క్కాలుడికెడి నీళ్లు
ద్రావి మాన్పడెడు తు ♦ రష్కులైన
గోవులఁ బడమొత్తి ♦ కోసి ముక్కలు మెక్కు
సముద్రాంధు లగుకొండ ♦ సవరలైన
తెరవాట్లు గొట్టిక ♦ త్తెరదొంగలై చాల
వాలించు తిరుగుచం ♦ డాలులైన
భూసుర క్షేత్రమిది యన్నఁ ♦ బోఁడొకండు
చిన్నపొలములు బ్రాహ్మణ ♦ క్షేత్రమునకు
ఘాతుకత్వంబు సేయుము ♦ ష్కరులు గలరె
కదలు మిట మాని దివిజగం ♦ గాభవాని.

సీ. కృతకాద్రు లాయెనా ♦ కీలోగ్ర ఫణిఫణా
నేకపూత్కారప ♦ ల్మీకచయము
విరిదోఁట లాయెనా ♦ కఱకు కంటకకంట
కాంకురవిస్ఫురి ♦ తాగచయము
పువుఁబాన్పులాయెనా ♦ నవమంజుల శ్వేత
లవణాలవాలమా ♦ చవుటినేల
బొమ్మరిం డ్లాయెనా ♦ భూరిభేకాండ జా
ధారమై తనరుకే ♦ దారచయము
నీకు విహరింప వసతులై ♦ నిప్పటిలెనె
చిన్నపొలములు బ్రాహ్మణ ♦ క్షేత్రములకు
ఘాతుకత్వంబు చేయుము ♦ ష్కరులు గలరె
కదలు మిట మాని దివిజగం ♦ గాభవాని.

ఈరీతిగఁ బద్యములు వ్రాసి వ్రాసిన తాటాకులను నీటిలో విడువ నట్టిదూషణను సహించి యచటనిలిచి యుండుటయు క్షేమముకాదని తెలుపుటకో యనఁజెఱువులోని నీరు గండితెగిపాఱి సముద్రగామియయ్యె. కవికిఁ గలిగినబాధ యంతటితోఁదొలఁగెను. రామన కృతకృత్యుఁడై పొలమునుండియింటికేఁగెను.

ఈపద్యముల రచనతో సంబంధించి పారంపర్యముగ నొకవింత చెప్పఁబడుచున్నది. మీఁద వ్రాయఁబడిన యర్జీపద్యములలో మొదటి దానియెత్తు గీతమునందు "మాపుట్టిముంపఁ దలఁచి" యని ప్రయోగించుటచేతఁ గవికిఁ గళత్రనష్టమైనదఁట. "వరిపుట్టి ముంపఁదలఁచి" అని చెప్పనుద్దేశించినను దైవికముగ మాపుట్టి ముంపఁదలఁచి యని ప్రయోగింపఁబడెనఁట. ఈగాథయొక్క సత్యాసత్యములు చర్చింపనవకాశమేమియు లేదు. కుటుంబములోఁ దరముల వెంబడివచ్చుచున్న యంశమగుటచే నిందుఁ బొందుపఱుప సాహసించితిని.

## — పద్యముల కర్తృత్వమును గూర్చిచర్చ. —

1. సూరకవి తనతండ్రియగు బాలభాస్కరకవి మరణానంతరము స్వగ్రామమగు భూపాలరాజురేగ విడిచి చీపురుపల్లెకు సమీపమున నున్న రామచంద్రపురమును దనకు నివాస స్థలముగనేర్పఱచుకొనెనని మూఁడవ ప్రకరణమున వ్రాసి యుంటిని.ఇంతియ గాక.

చ. కరిణిలువాౘ్ఛితగాని యొక ♦ గం టెఁడెఱుంగము మన్యదేశముల్
తిరిగి యభీష్టవస్తువులు ♦ దెచ్చి భుజింతుము సర్వకాలముల్
మురచిర సత్కవిత్వనిధి ♦ సూరకవీంద్రున కేలగల్గెఁ గం
చరమును రేగ ? మేఁక మెడ ♦ చన్నులవంటివి రెండుమాన్యముల్.

అను నీపద్యమును బట్టి సూరకవికి రేగలో మాన్య మున్నదని తెలుచున్నను నతఁడు కరిణికపువృత్తిచే జీవనము చేయక కవితావృత్తిచే దేశాటనము చేయుచుఁ గాలక్షేపము చేయుచుండెనని దృఢముగాఁ జెప్పవచ్చును. దీనిని బురస్కరించు కొని సూరకవి రామకవిగార్ల కాలమున రేగ గ్రామమునఁ గరిణికము చేయుచున్నవాఁడు సూరకవి కాఁడనియు,రామకవిగాని మఱియొకరు గాని కరణికము చేయుచుండిరనియు మనమూహింపవచ్చును. ఇంక మొదటినుండియు ననఁగా రామకవికిఁ బూర్వమునఁ దరువాతను గూడ నీరామకవివంశజులే నేఁటికిని రేగ గ్రామమునఁ గరణికముచేయు చున్నారు. కాఁబట్టి నీటిముంపు తగాయిదా గ్రామము గుత్తదారు అన్నమరాజుగారికిని గ్రామ కరణము రామకవికిని గలిగియుండునని చెప్పుటయె యుక్తము గాని పై యూరనుండి కరిణికముచేయని సూరకవికి దానితో సంబంధమున్నదని చెప్పుట యెంతమాత్రమును సరికాదు.

2. ఇదిగాక యసలు సనదుదారగు అడిదము నారప్పకుఁ జినలచ్చన్న, కిత్తన్న, నీలాద్రియను ముగ్గురు కుమారులుండిరి. నారప్ప యనంతర మీముగ్గురును బిత్రార్జితమగు మిరాశీయి

నామును బంచుకొని యనుభవించు చుండిరి. ఈయినాముభూముల నత్తియున్న నోములచెఱువు పూర్తిగ నిండునపుడు కత్తన్న వంతునకు వచ్చిన పొలమునకే ముంపుతగులును గాని తక్కినవారి పొలముల కంతగా ముంపుతగులదు. అందుచే నీటి ముంపువలన సస్యనష్టమును బొందిన రామనకే దీనితో సంబంధముగలిగి యుండెనని యూహించుట యుక్తముగాని ముంపువలన నెట్టినష్టమును బొందని సూరకవ్యాదులకు సంబంధము కల్పించుట యుక్తముగాదని నాయభిప్రాయము.

3. మాయింటనున్న వ్రాతప్రతులలోను మాయూరిలో నాస్నేహితుల వద్దనున్న ప్రతులలోను “ పేరురామన ” అనియే పాఠము గానవచ్చుచున్నది. మాగ్రామమునఁ గల ప్రతులలో నెల్ల ఆకె సరవయ్యయను వైశ్యునిచే సంగ్రహింపఁబడినది ప్రాచీనమైనదిగఁ గానబడుచున్నది. ఇయ్యది యఱువది సంవత్సరముల క్రిందటికాలమున గ్రామపురోహితులగు రుద్రావఝ్ఝుల నరసింహముగారిచే వ్రాయఁబడినది.

4. ఇదిగాక సుమారు 50 సంవత్సరముల క్రిందటఁ గాలధర్మమొందిన సూరకవి ప్రపౌత్రుఁడగు బాలభాస్కరకవి చెప్పిన యీక్రింది సీసపద్యముచేత చెఱువుమీఁది పద్యములతో సూరకవికి సంబంధములేదనియు వానిని రచించినది రామకవి యనియు స్పష్టమగుచున్నది.

సీ. విజయరామక్షమా ♦ విభుఁదిట్టి భాసిల్లె
ధరణిలో మాపిప్పి ♦ తాతమహుండు
గంగాభవానిని ♦ గడుదిట్టమైతిట్టి
ఖ్యాతిఁజెన్నొందె మా ♦ తాతయొకఁడు
వెలయంగ మగటిమ ♦ వేంకనఁ బడఁదిట్టి
తగఁదెగటార్చె మా ♦ తండ్రిగారు
ఆరీతి గాఁదిట్టి ♦ యమపురంబునకును
నిన్నుఁ బంపఁదలంచి ♦ యున్నవాఁడఁ
గాచుకొమ్మిటుమీఁద న ♦ ఖండచండ
దారుణోద్దండ కవితాగ ♦ భీరశక్తి
నీతరముగాదు కలహించి ♦ నిర్వహింపఁ
జల్ల పట్టాభిరామ నీ ♦ చగుణధామ.

ఈపద్యమును జెప్పిన బాలభాస్కరకవి రామకవికి వరుసకు మనుమఁడు. అందుచేతనే యతఁడు "......ఖ్యాతిఁజెన్నొందెమాతాత యొకఁడు" అని రామకవినిఁ బ్రశంసించినాఁడు. సూరకవి విజయరామగజపతి మహారాజునకు నాస్థానకవిగానుండెనని మొదవప్రకరణమున వ్రాసియే యున్నాఁడను. మాకుటుంబములోఁ దరములవెంబడి వచ్చుచున్న వాడుకను గూడఁ బ్రబల ప్రమాణములలోఁ జేర్పఁదగినదిగా యోచించి మీఁది యంశముల నన్నిటిని బట్టి యాలోచించినచోఁ జెఱువుమీఁది పద్యములతో సూరకవి కెంతమాత్రమును సంబంధము లేదనియు వానిని రామకవియే రచించెననియు స్పష్టముగాక పోదు.

ఇప్పటికి సుమారు నూరునూటయేఁబది సంవత్సరముల నుండి యీపద్యములు సూరకవి ప్రణీతమని బహుళవ్యాప్తిగాంచినవి. ఇట్టి వాడుక మాకుటుంబములో వంశపారంపర్యముగ వచ్చుచున్న వాడుకకు విరుద్ధముగా నున్నది. అట్టి విరుద్ధమగు వాడుక నిలిచి యుండుట యుక్తము కాదని యెంచి యందలి సత్యాసత్యములను లోకమునకు వ్యక్తపఱచుట నావిధియని తలఁచి యీవిమర్శనమును జేసితిని.



# పదియవ ప్రకరణము.

## గ్రంథరచన.

క. కవియెఱుఁగును భువితత్త్వము
భువిలోపలనుండు జనులఁ ♦ బోషించుసదా
శివుఁడెఱుఁగు నాట్యతత్త్వము
కవితాతత్త్వంబు సూర ♦ కవికే తెలియున్.
(కవిసమకాలికులు)

పదునెనిమిదవ శతాబ్దియందుఁ బ్రౌఢప్రబంధ రచనకుఁ బ్రసిద్ధిగాంచిన కవులలో నొకఁడనియు, లాక్షణికుఁడనియు సూరకవి విశేషప్రఖ్యాతి గాంచెను. ఇతఁడు రచించిన గ్రంథములలో నాంధ్ర ప్రపంచమునకు లభ్యములై ప్రచారములోనున్న వియాఱుగ్రంథములు మాత్రము గానవచ్చుచున్నవి. (1) చంద్రమతీపరిణయమను నామాంతరము గల కవి జనరంజనము. (2) కవిసంశయ విచ్ఛేదమను లక్షణగ్రంథము. (3) చంద్రాలోకము (భాషాంతరీకరణము) (4) ఆంధ్రనామశేషము (నిఘంటువు) (5) రామలింగేశ శతకము. (6) శ్రీరామదండకము. ఇతఁడు రచించిన గ్రంథములలోఁ గవిసంశయ విచ్ఛేదమున వ్రాయఁబడిన మూఁడునాలుగు కృత్యాదిపద్యములు తప్ప మఱేదేనియందును గృత్యాదిపద్యములు గానరావు. ఆ కారణము చేత

నితని గ్రంథములను గూర్చిన సమాచారము స్పష్టముగఁ దెలిసి
కొన నవకాశము లేక యున్నయది. ఇతనిగ్రంథములలో నెల్ల
ముఖ్యమైనదియుఁ దనకు మిగులఁబ్రఖ్యాతి దెచ్చినదియు నగు
కవిజనరంజనము నందుఁగూడఁ గృత్యాదిపద్యములులేవు. వంశ
చరిత్రమును జెప్పు సందర్భమున నీవిషయమును గూర్చి ప్రథమ
ప్రకరణమునందుఁ గొంతవఱకుఁ జర్చించి యున్న కారణముచేతఁ
జర్వితచర్వణమగునని యెంచి యాచర్చనిచటఁ దిరుగ వ్రాయ
మానితిని.

సూరకవి గ్రంథరచనకుఁ బూని తొలుదొల్త కవిజనరం
జనమును రచించినట్టుగఁ గనఁబడుచున్నది. కవి సంశయవిచ్ఛే
దములోని.

క. పుడమిఁగల రసికులెల్లఁ బొ
గడఁగవిజన రంజనకృతిఁ ♦ గావించితి నే
నడిదము సూరకవీంద్రుఁడ
మృడపదపంకజరిరంసు ♦ మృదుమానసుఁడన్.

అను పద్యమును బట్టి యితఁడు కవిసంశయ విచ్ఛేదమును రచిం
చుటకుఁ బూర్వము కవిజనరంజనమురచించెనని తెలియుచున్నది.

1. కవి జనరంజనము:—ఇది మూఁడాశ్వాసముల శృం
గారప్రబంధము. ఇందభివర్ణింపఁ బడిన విషయము చంద్రమతీ
హరిశ్చంద్రుల వివాహము. తృతీయాశ్వాసాంతమున.

తే. గీ. సత్యమును దృఢవ్రతంబుగా ♦ సంగ్రహించి
రాజసూయాది వివిధాధ్వ ♦ రములొనర్చి
వరగుణోజ్జ్వలసంతాన ♦ వంతుఁడైక
రమును సుఖముండెనాధరా ♦ రమణమౌళి.

అని చెప్పి హరిశ్చంద్రునిపూర్వకథతోనే ప్రబంధమును ముగించినాఁడు. కథా విన్యాసమునఁ గల్పనాచాతుర్యమును జూపన వకాశమంతగాఁ జిక్కినదికాదు. ఇందలి కథను నొకటిరెండు వాక్యములలో నిట్లు చెప్పవచ్చును.

పూషవంశ భూషణుండగు త్రిశంకుభూపసుతుఁ డయోధ్యానగరమును రాజధానిగాఁ జేసికొని భూమిని బరిపాలించుచుండఁ బుడమికిఁ దొడవగు విజయాస్పదపురమును దనకుఁ బ్రధాన నగరముగఁ గావించుకొని యుశీనరధరావరుఁడు రాజ్యపాలనమొనరించు చుండెను. ఆయుశీనరునకుఁ జంద్రమతి యను కుమారీ రత్నముజనించెను. ఆమెకు జవ్వనమంకురించిన పిదప హరిశ్చంద్రుని సుగుణసంపదను వినియును నతని మనోహరాకృతిని జిత్రపటమునఁ గనియును నతని యందే తన చిత్తమును హత్తించియుండనాసమాచారము నామెచెలికత్తెల ముఖమున వినినవాఁడై యుశీనరధరారమణుఁడు దృఢవ్రతుండను బ్రాహ్మణోత్తముని హరిశ్చంద్రుని పాలికిఁబుత్తెంచెను. హరిశ్చంద్రుఁ డావిప్రుని వలనఁజంద్రమతి సుగుణసంపదయు, రూపలావణ్యాతిశయమును విని తనకామె తగిన పత్నియనితలఁచి తనయంగీకారమునుదృఢ

వ్రతునకుఁజెప్పివచ్చు నతఁడాశుభవార్తనుజంద్రమతి జనకునకుఁ దెలియఁజెప్పెను. పిదప విజయాస్పదపురమునఁ గడువైభవముతో వివాహసన్నాహంబులు జరుగ హరిశ్చంద్రుఁడయోధ్యానగరమునుండి తలిఁవెడలి విధ్యుక్తముగఁ జంద్రమతినిఁ బాణిగ్రహణము చేసికొని సంతోషపూరితహృదయాంతరంగుఁడై మామ, యొసఁగిన యరణములతోఁ జంద్రమతినిఁ జేకొని యయోధ్యానగరమునకు వచ్చి సుఖముగ రాజ్యపాలన మొనర్చుచుండెను.

ఈ కథనే సూరకవి, మూఁడాశ్వాసములలో 260 పద్యములతోఁ జెప్పెను. అందుఁబ్రథమాశ్వాసము పురవర్ణనాదికముతోడను, చంద్రమతి జననసౌందర్యాభివర్ణనముతోడను ముగియును. ద్వితీయాశ్వాసమున, వసంతము, చంద్రమతీవిరహము, మలయపవనాద్యుపాలంభము, దృఢవ్రత సందేశమును ననునవి వర్ణింపఁ బడినవి. తృతీయాశ్వాసమున హరిశ్చంద్రుని కళ్యాణయాత్ర, చంద్రమతీ హరిశ్చంద్రుల వివాహమహోత్సవము, నూతనవధూవరుల గృహప్రవేశము, సూర్యాస్తమయము, తమస్సు, తారలు, చంద్రోదయము, ప్రభాతము, కోడికూఁత, సూర్యోదయము, మొదలగునవి యభివర్ణింపఁ బడినవి.

ఈప్రబంధరచన యందు సూరకవి తనకుఁ బూర్వులగు శ్రీనాథాది మహాకవులను నెక్కుడుగ ననుసరించియున్నాఁడు.

శైలియందును, గల్పనావిషయమునను నీకవిజనరంజనములోని పద్యములు పెక్కులు నైషధము, వసుచరిత్రము, కవికర్ణరసాయనము మొదలగు ప్రసిద్ధాంధ్రప్రబంధములలోనిపద్యములకు ఛాయగ నున్నవి. కవిత్రయము వారికవిత్వము నితఁడెంత శ్రద్ధాభక్తులతోఁ బఠించెనో యంతగా శ్రీనాథ మహాకవి గ్రంథములను,—అందుముఖ్యముగ శృంగారనైషధమును— వసుచరిత్రమును, మనుచరిత్రమును బఠించి నట్టుగ నిందలి పద్యములే ప్రబలమగు సాక్ష్యమునిచ్చు చున్నవి. ఈప్రబంధమునందుఁ జేయఁబడిన పురవర్ణనాదులలోఁ గొన్నిమాత్రమిచటఁ జూపఁ బడుచున్నవి.

### 1. పురము.

క. నూపురము భూపురంధ్రికిఁ
గోపురము జయేందిరకును ♦ గగనతలస్ప్రు
గ్గోపురము భాసిలునయో
ధ్యాపురమిన వంశభూధ ♦ వాధారంబై.

మ. అమరద్వీపవతీ పయోవిహరణ ♦ ప్రాంచత్సురస్త్రీల వ
జ్రమయాభ్రంకషమంటపాగ్రములని ♦ చ్చల్ క్రీడఁగావించు త
ద్రమణీవారము వేలనేలుపట్టున ♦ న్రాదంచుఁగా దివ్యరా
జముఖీపాళికిఁ దమ్మిచూలియని మే ♦ షత్వంబుఁ గావించుటల్.

### 2. పూఁదోఁటలు.

క. వలపులపాణింధమములు
మలయానిలముల విహార ♦ మందిరములు
పూవిలుతుని యాయుధశాలలు
చలువలజన్మస్థలము ల ♦ చటిపూఁదోఁటల్.

### 3. పద్మాకరములు.

గీ. అతుల దరచక్రమీన రే ♦ ఖాంకములయి
యూర్మికాకంకణద్యుతి ♦ నొప్పుమీఱి
చారుపద్మాకరమ్ముల ♦ చందమునను
రాజిలుచునుండు పద్మాక ♦ రములువీట.

### 4. రాజు.

సీ. తనపృథుకీర్తిము ♦ క్తాఛత్రమునకు స్వ
ర్ణధరంబు కనకదం ♦ డంబుగాఁగఁ
దనప్రతాపసమగ్ర ♦ దావాగ్నిశిఖకు వ్యో
మంబుతదగ్ర ధూ ♦ మంబుగాఁగఁ
దననిరర్గళదాన ♦ ధారాంబులహరికిఁ
గైలాసశిఖరిసై ♦ కతముగాఁగఁ
దనకటాక్షస్యంది ♦ ఘనకృపారసవృష్టి
కఖిలార్థికోటి స ♦ స్యంబుగాఁగ
గీ. మహినిజెలువొందె మత్తారి ♦ మండలేశ
మకుటమణిగణశాణాయ ♦ మానచరణ
నఖరపాళి నిజాశ్రిత ♦ నళినహేళి
చారుకీర్తిహరిశ్చంద్ర ♦ చక్రవర్తి.

### 5. వసంతము.

చ. వలపులకున్నిదాన మలి ♦ వారము కోరనికోర్కి-జాతికిం
దలఁపని కీడు పాంథసము ♦ దాయముపాలిటివేలు విత్తు కో
కిలముల నోముపంట స్మర ♦ కేవలశౌర్యహుతాశధాయ్యరా
చిలుకలభాగధేయ మిలఁ ♦ జెన్నలరారె వసంతమంతటన్.

## 6. విరహము.

1. సీ. ఎలనాగపల్కుల ◆ కెనగావటంచునో
చెవియొగ్గి వినఁడయ్యెఁ ◆ జిలుకపల్కు-
లింతినెమ్మోముతో ◆ నీడుగాదంచునో
తళుకుటద్దముఁజూడఁ ◆ దలఁపఁడయ్యెఁ
బూఁబోఁడి బాహులఁ ◆ బోలలేవంచునో
పూవుదండలు మేనఁ ◆ బూనఁడయ్యెఁ
బాలఁతిమై తావితోఁ ◆ బురుడుగాదంచునో
మొనసి శ్రీగంధంబు ◆ ముట్టఁడయ్యె
గీ. బోటినిట్టూర్పుగాడ్పుతో ◆ సాటిగాద
టంచునో యుశీరతాలవృం ◆ తానిలంబు
సొంపునను నించుకేనిఁగాం ◆ క్షింపఁడయ్యె
మదనసాయక ఖిన్నుఁడై ◆ మనుజవిభుఁడు.

2. తే. గీ. అతనుతాపంబుఁగావింత ◆ మనుచుఁగోరి
సఖులుశైత్యోపచారముల్ ◆ సతికిఁజేయ
దైవమొండొకయర్థంబు ◆ దాగ్రహించి
యతనుతాపంబుఁ గావించె ◆ నబ్జముఖికి.

3. శా. శయ్యాదంభమునన్ మురాంతకుఁడు భూ ◆ షాకైతవస్ఫూర్తి చే
నయ్యార్యారమణుండుఁదాల్చిరి భుజం ◆ గాధీశులన్నియ సా
హాయ్యప్రస్ఫుటధాటికోర్వఁకనుచో ◆ నబ్జాస్యలాయోర్చ్వవా
రయ్యాగంధసమీర! ప్రోవఁగదవ ◆ య్యా! యీకురంగేక్షణన్.

## 7. యాత్ర.

సీ. శ్వేతాతపత్రాళి ◆ చీఁకట్లుదోలఁగించె
రాజన్యభూషణ ◆ రత్నరుచులు

తురగఖురోద్ధూత ♦ ధూళి పెంపడఁగించెఁ
గరిపుష్కరోజ్ఝిత ♦ కంకణములు
సింధురమదవృష్టి ♦ సింధులనింకించె
సామంతమకుటక ♦ క్షణరజంబు
సైన్యసమ్మర్దసం ♦ జనితోష్మఁదొలఁగించె
నమితపతాకాంబ ♦ రానిలంబు
సైన్యజనితావరోధంబు ♦ సైన్యముననె
తొలఁగెనని సైనికాళి సం ♦ తోషమందఁ
జనియె సైన్యంబు కతిపయ ♦ దినములకును
రమ్యవిజయాస్పదపురీవ ♦ రంబుఁజేర.

## 8. పరిణయము.

మ. అలమన్మేఁబులకాంకురాళిదరహా ♦ సాంకూరముల్కన్గవం
దొలఁకన్మర్త్యపుటాంట్లు గండయుగళిం ♦ దూఁగంగనత్కంకణం
బులుమోయన్భుజమధ్యసీమ రతనం ♦ పుండాళితాత్మాయుగాఁ
దలఁబ్రాలోప్పెసెలతాఁగియాదలపయున్ ♦ ధాత్రీశుఁడత్యాదృతిన్.

క. మంగళతూర్యంబులు పు
ణ్యాంగనల శుభార్హగీతి ♦ కారావములు
ప్పొంగంగ హరిశ్చంద్రుఁడు
మంగలసూత్రంబు చంద్ర ♦ మతికింగట్టెన్.

## 9. నయవిరచనము.

సీ. అనుఁగుబిడ్డలభంగి ♦ ననుజీవులను బ్రోవు
మిలువేలుపులఁ గొల్వు ♦ మేమఱిలక
పలికిముం దనుభవిం ♦ పకుమేపదార్థంబు
జవదాటకుము నిజే ♦ శ్వరునిమాట

మగఁడు గావించిన ♦ మన్ననకుబ్బకు
మదిఁగృశింపకు మన ♦ మానమునకు
నవనిసురాభ్యాగ ♦ తార్థికోటులనెల్ల
నాప్తబంధువుల య ♦ ట్లాదరింపు
గీ. కరుణగల్గుము బంధువ ♦ ర్గములకెల్ల
గురుజనంబుల సద్భక్తిఁ ♦ గొలువు మెపుడు
దైవమన్నను గురువన్న ♦ ధర్మమన్నఁ
బ్రాణనాథుండు సుమ్మమా ♦ యమ్మ కాన.

## 10. చంద్రోదయము.

సీ. కుముదినీజృంభణాం ♦ కురమూలకందంబు
తోయజశ్రీపశ్య ♦ తోహరుండు
సకలజీవంజీవ ♦ సంజీవనౌషధి
చక్రవాకీమన ♦ స్తాపకారి
తిమిరవారణఘటా ♦ సమదమృగేంద్రంబు
చిత్తజమాండ్యవి ♦ చ్ఛేదనుండు
అఖిలదిదృక్షుజ ♦ నాసేచనకమూర్తి
బహుళౌషధీప్రియం ♦ భావుకుండు
సురలయాఁకటికూడు మ్రు ♦ చ్చులకుఁగీడు
రిక్కలకుఱేఁడు వెలుఁగుల ♦ యిక్కజోఁడు
లచ్చిసైదోడు రేఁబోటి ♦ వెచ్చకాఁడు
చంద్రుఁడలరారెసత్కళా ♦ సాంద్రుఁడగుచు.

## 11. సూర్యోదయము.

చ. కలువలసూఁడుతమ్మిచెలి ♦ కాఁడునిశావిభుజంట చుట్టుపు
ల్గులగమినోముపంటఖగ ♦ ఘోటునకున్ వలచూపుమూఁడుమూ

ర్తులునొకపైనరూపుతోఁగ ♦ రంజిగిరంగువెలుంగుపోవు పాఁ
బలుకులతావుపూర్వగిరి ♦ పైనఘుడొప్పెడి నేందుఁ డెంతయున్.

ఈకవి జనరంజనములోని పద్యములుకొన్ని, నైషధము, వసుచరిత్రము మొదలగు ప్రసిద్ధాంధ్ర ప్రబంధముల యందలి పద్యముల ననుకరించియున్నవని చెప్పియుంటిని. అట్టి యనుసరణములఁ గొన్నింటి నీదిగువఁజూపు చున్నాఁడను.

—— నైషధపుఁబోలికలు. ——

1. సీ. భక్తిప్రదక్షిణ ♦ ప్రక్రమంబులఁ జేసి
ఁాశుశుక్షణికిను ♦ పాసనంబు
నంశుకగ్రంధి క ♦ శ్యాణక్రియాచార
మాఁచరించిరిమంద ♦ హాసమెసఁగ
నత్తొత్తిచూఁచిరి ♦ యాకాశమండలా
స్థానరత్నంబునౌ ♦ త్తానపాదిఁ
త్రైలోక్యపతి దేవ ♦ తాఫాలతిలకంబు
దివిరియఁరుంధతీ ♦ దేవిఁగనిరి
గీ. బ్రాహ్మణోత్తమ పుణ్యపు ♦ రంధ్రివర్గ
మంగళాశీర్వచోయుక్త ♦ మహిమశోభ
నాక్షతారోపణంబుల ♦ నాదరించి
రంబుజాక్షియునిషధ దే ♦ శాధిపతియు.
(శృంగారనైషధము 6 ఆ 101 ప.)

సీ. కేలుమోడ్చిరి ప్రద ♦ క్షిణపూర్వకంబుగా
నాశుశుక్షణికి న ♦ త్యాదరమునఁ
గాంచిరిగ్రహతార ♦ కామండలోపతి
స్థానసంవాసినౌ ♦ త్తానపాది

ప్రణతిఁ గావించిరి ♦ భక్తి నరుంధతి
సీమంతినికిని వ ♦ సిష్ఠునకును
జేసి రత్నవమునఁ ♦ జేలాంచలగ్రంధి
సముచితపరిణయా ♦ చారనియతి

గీ. ద్విజవరేణ్యులు బహుపురం ♦ ధ్రీజనములు
ప్రీతి నాశీర్వదించి య ♦ ర్పించు శోభ
నాక్షతలు గైకొని ధరించి ♦ రౌదలలను
జంద్రమతియు హరిశ్చంద్ర ♦ చక్రవర్తి.

(కవిజనరంజనము 3 ఆ॥ 48 ప॥)

2. ఉ. కంకణనిక్వణంబు మెఱుగ ♦ క్రాఁగఁగొనసియాడరత్న తా
టంకవిభూషణంబులు వ ♦ డంకఁ గుచంబులు రాయిడింపఁగాఁ
బంకజనేత్రి గౌతముని ♦ పంపున లాజలు దోయిలించి ధూ
మాంకనియందు వేల్చె దర ♦ హాసము ఱెప్పలలోన దాఁచుచున్.

(శృంగారనైషధము 6 ఆ॥ 102 ప॥)

చ. అలఁతికవున్నవడంకవల ♦ యాధని నిర్మలబాహుమూలకాం
తులు గొనియాడ లేనగవు ♦ తొంగలి ఱెప్పల డాఁగ హారము
ల్మెలిగొన జల్కుపయ్యెద చ ♦ లింపఁగుచద్వయి రాయిడింబడం
జెలి దలఁబ్రాలు వోసె నృప ♦ శేఖరునాదలపైని దోయిటన్.

(కవిజనరంజనము 3 ఆ॥ 38 ప॥)

క. వనితామణిపాదాబ్జము
తనహస్తాబ్జములఁ బట్టి ♦ దరహాసరుచుల్
కను ఱెప్పలలో డాఁచుచు
సనికల్ ద్రొక్కించె రాజు ♦ జవ్వని చేతన్.

(కవిజనరంజవము 3 ఆ॥ 45 ప॥)

మ. గురువన్నన్ ధనమన్నఁ బుణ్యమనినన్ ♦ గోత్రోదయంబన్న దే
వరయన్న న్మనమన్నఁ దుష్టియనినన్ ♦ వాత్సల్యమన్నన్ని జే
శ్వరుఁడన్నం బరమోపకారమనినన్ ♦ సర్వంబునన్నం దలో
దరి నీకున్ నిషధాధినాథుఁడె సుమీ ♦ తథ్యంబుగాఁ జెప్పితిన్.

సీ. పాటించి కొలువుము ♦ భవన దైవంబుల
సవతులఁ గొనియాడు ♦ సఖులఁ బోలె
నారాధనము సేయు ♦ మత్తమామల కెప్డు
పరిజనంబుల మీఁదఁ ♦ గరుణ గల్గి
యలుగకు కోపించి ♦ నపుడు నాథునితోడ
మదిలోన నుబ్బకు ♦ మన్ననలకుఁ
దోడికోడండ్రతోఁ ♦ గూడియాడి చరింపు
దాసీజనముఁ బ్రోవు ♦ తల్లి కరణి
తే. బ్రాహ్మణులయందు గురులందు ♦ బంధులందు
భక్తివిశ్వాస సౌహార్ద్ర ♦ పరత సెలుపు
భవ్యపతి దేవతాచార ♦ పరమపుణ్య
ధర్మమేమరకుందు మా ♦ తల్లి కాన.

(శృంగార నైషధము అ॥ 7-8,9 పద్య॥)

సీ. అనుఁగు బిడ్డల భంగి ♦ ననుజీవులను బ్రోవు
మిలువేలుపులఁ గొల్వు ♦ మేమఱలక
పతికి ముందనుభవిం ♦ పకు మేపదార్థంబు
జవదాటకుము నిజే ♦ శ్వరుని మాట
మగఁడు గావించిన ♦ మన్ననకుబ్బకు
మదిఁ గృశింపకు మవ ♦ మానమునకు
నవనిసురాభ్యాగ ♦ తార్థికోటుల నెల్ల
నాప్తబంధువులయ ♦ ట్లాదరింపు

కరుణఁగల్గుము బంధువ ♦ ర్గములకెల్ల
గురుజనంబుల సద్భక్తిఁ ♦ గొలువు మెపుడు
దైవమన్నను గురువన్న ♦ ధర్మమన్నఁ
బ్రాణనాథుండు నుమ్మ మా ♦ యమ్మ కాన.
(కవిజనరంజనము 3 ఆ॥ 54 పద్యము.)

— కవికర్ణరసాయనపుఁ బోలికలు —

ఉ. కన్నులఁజంచలత్వమును ♦ గా్ర్యమపాం గవిలోకనంబులం
జన్నులఁగర్కశత్వముఁ గృ ♦ శత్వముఁగౌనునమంద భావము
న్నెన్నడ వక్రతంగురుల ♦ నెక్కొనఁజేసియు నెట్టిచిత్రమో
కన్నియ జవ్వనంబు త్రిజ ♦ గజ్జన సన్నుతమయ్యె నయ్యెడన్.
(కవికర్ణరసాయనము 3 ఆ॥ 20 పద్య॥)

ఉ. కన్నులచంచలత్వమును ♦ గబ్బిచనుంగవ కర్కశత్వము
న్నెన్నడమాంద్యముంగురుల ♦ నెక్కొనువక్రత కౌను కార్శ్యము
న్నన్నుతికెక్క నౌనచల ♦ సంపద బోఁటికటిన్ధరించుట
న్వన్నియకెక్కవేయవగు ♦ ణంబులు మిక్కిలికల్మియున్నెడన్.
(కవిజనరంజనము 1ఆ॥ 54 పద్య॥)

సూరకవి పద్యములోని యర్థాంతరన్యాసము మీఁదిప ద్యమునకు వన్నె దెచ్చెనని చెప్పనగును.

క. కరమర్థి నేన పెనుపం
బెరిగినశుకమాట లేక ♦ ప్రేలుచుహృదయం
బెరియింపఁ దొణఁగెనింకం
బరభృతములు చెప్పనేల ♦ పంకజవదనా.
(కవికర్ణరసాయనము ఆశ్వా॥ 3. 104 పద్య॥)

ఆ. పరభృతంబుగానఁ ♦ బరికించి యొకవేళఁ
గోకిలంబుచేయఁ ♦ గూడుఁగాక

కాంతనామధేయ ♦ మెంతయుఁగైకొని
చిలుకనీకుపెట్ట ♦ సేయఁదగునె.

(కవిజనరంజనము ఆశ్వా॥ 2. 50 ప॥)

సీ. మూర్ధాభిషిక్తుల ♦ ముకుటరత్నద్యుతు
లక్కరదీపదీప్తులఁ ♦ గలిపికొనఁగ
రత్నవేత్రపరంప ♦ రారుచుల్పురసతీ
నీరాజనాంశుల ♦ నిలిపికొనఁగ
స్మేరముఖాంబుజ ♦ శ్రీపార్శ్వదోధూయ
మానచామరలక్ష్మి ♦ మాఱుకొనఁగ
వందిమాగధులకై ♦ వారంబురావంబు
శుభతూర్యరవములఁ ♦ జూఱకొనఁగఁ
గీ. బసిడిరథమెక్కి విభులవై ♦ భవము మెఱయఁ
జూపరులకెల్ల వేడ్కఁపుఁ ♦ జోద్యమొదవ
సాంగమైవచ్చు భాగధే ♦ యంబుఁబోలె
మామయింటికి వచ్చెజా ♦ మాతయపుడు.

(కవికర్ణరసాయనము 3 ఆశ్వా॥ 175 వ పద్యము.)

సీ. రాజన్యకోటీర ♦ రత్నమరీచులఁ
గరదీపికాపఙ్క్తిఁ ♦ గలసిమెలఁగ
నాభీలపటుభేరి ♦ కాభూరిభాంకృతుల్
మత్తేభఘీంకృతుల్ ♦ మైత్రినెలుప
సుర్వీసురప్రజా ♦ శీర్వాదనాదము
ల్విమలవందిస్తుతు ♦ ల్వియ్యమంద
వారాంగనాదత్త ♦ నీరాజనాంశువుల్
హైమవేత్రద్యుతు ♦ లల్లుకొనఁగ

గీ. భద్రకరినెక్కి రూపసై ♦ భవసమృద్ధి
దర్శనవ్యగ్ర పౌరసం ♦ తతికి నేత్ర
పర్వమొనరించుచును సార్వ ♦ భౌముఁడపుడు
భూతలాధిపశుద్ధాంత ♦ మునకువచ్చె.

(కవిజనరంజనము 3 ఆ॥ 20 ప॥)

## — వసుచరిత్రపుఁబోలికలు. —

మ॥ జననాథోత్తముఁడింతిఁజూడ ననిమే ♦ షత్వంబు గాంక్షించు న
య్యనిమేషత్వము కాంతకాంతముఖ చం ♦ ద్రాసేవనానంద వా
సనఁబ్రాపించినఁ గోరునప్పుడనిమే ♦ షస్వామి భావంబుఁ గ
న్గొననెంచున్ నృపులుత్తరోత్తరపదా ♦ నూనస్పృహాచంచలుల్.

(వసుచరిత్రము 2 ఆ॥ 64 ప॥)

శా. కాంతారత్నసమాగమంబును నెద ♦ న్గాంక్షించు నేతెంచుడుం
జెంతంజేరఁగఁగోరుఁ జేరుడుఁగుచా ♦ శ్లేషాప్తిఁగాంక్షించుఁగా
నంతందత్కళ లంటఁగోరు ఫలత్వ ♦ ప్తాత్మత్వముర్వీవధూ
కాంతానర్హమటంచుఁబల్కు స్మృతివా ♦ క్యస్ఫూర్తిఁజాసార్థంబుగన్.

(కవిజనరంజనము 3 ఆ॥ 123 ప॥)

II

చ॥ అలిసలవేణియిట్లు వల ♦ యాంక బిసాంకురపన్నగాళికిం
జలమరిచల్లగాలికిని ♦ జక్కరఖాణపు తేజిఁదోలు పూ
విలుతువయాళికిం జిగురు ♦ పింఛుల నీలిగయాళికిన్ హలా
హాలగుళికాభదుస్మదఘు ♦ నాళికి నాళికిలోఁగి యాత్మలోన్.

(వసుచరిత్రము 3 ఆ॥ 112 ప॥)

క॥ అళుకొందెనప్పుడా తో
య్యాలి మధుకరనికర శుక పి ♦ కావళికిన్ జా

ఱిలికిఙ జిలిబిలివలికరు
వలికి న్వితివిలుతు సెప్క ♦ వ హాళాహళికిన్.

(కవిజనరంజనము 2 ఆ॥ 19 ప॥)

III

సీ॥ నటదీశహాసన వి ♦ స్ఫుటితవేధోండ శే
ఖలఁదోచు వరణాంబు ♦ కణికలనఁగఁ
బెల్లుబ్బునిగ్గపై ♦ స్వొల్లిసెల్లపదార్థ
ములుమున్గఁ బొడము బు ♦ ద్బుదములనఁగ
రవికి మంజేహా ని ♦ ర్మథన సాధనములై
వచ్చిన ద్విజమంత్ర ♦ వణకములన
హరిపదంబును నీశు ♦ శిరములైన నభంబు
న నభోగతులు నించు ♦ ననలనంగఁ

తే. జరమగిరియను మరకాడు ♦ జలధిసరణిఁ
దరణిడించిన నతఁడు త ♦ త్సలిలమగ్న
విమలముక్తాఫలంబులు ♦ వెలికిఁ జొనిపె
ననఁగ నవతారకా నికా ♦ యంబులడరె.

(వసుచరిత్రము 4 ఆ॥ 15 ప॥)

సీ. ధ్వాంతదంతావళో ♦ త్కర పుష్కరోద్ధూత
గగనగంగాపయః ♦ కణములనఁగ
శర్వతాండవ దిదృ ♦ క్షా సమాగత నిర్జ
రీ హార మౌక్తిక ♦ శ్రేణులనఁగ
నభ్ర కళింపజా ♦ హ్రదమున నిండార
విరిసిన తెల్లగల్వ ♦ విరులనంగ
భావి నిశాచంద్ర ♦ పదిణయంబునకిడు
దిక్కుడ్యముల పెండి ♦ టుక్కలనఁగఁ

గీ. గిరికిఁ దిసెనొక్కఁ మొగి నెల్ల ♦ దిక్కులందు
క్షీర ఘనసార పాటీర ♦ తారహార
హీర పారద నారద ♦ శారదాభ్రి
గౌరరుచిమీఱఁ దారకా ♦ వారమపుడు.

(కవిజనరంజనము 3 ఆ॥ 63 ప॥)

## IV

సీ॥ తనయశోవిశద ము ♦ క్తాసౌధపాళికి
నంబుదాయనము వా ♦ తాయనముగఁ
దనశౌర్య శిఖిశిఖా ♦ తతికి జాంబూనద
భూధరంబపరంజి ♦ పూదెగాఁగఁ
దనబలోద్ధతరజో ♦ దంభకుంభినికిఁ దా
రా గ్రిహంబులు గర్భ ♦ రత్నములుగఁ
దన దానధారాఖ్య ♦ వనధికి మిన్నేఱు
కల్లోలధుత వారి ♦ కణముగాఁగఁ

తే. దన వినూతన సుగుణ సం ♦ తానవల్లి
సముచయంబున కంభోజ ♦ సంభవాండ
భాండములఖండ ఫల పరం ♦ పరలు గాఁగ
వరలు భవ్యవిభా విభా ♦ వసుఁడు వసుఁడు.

(వసుచరిత్రము 1 ఆ॥ 116 ప॥)

సీ. తనపృథుకీర్తి మ ♦ క్తాభత్రమునకు స్వ
ర్ణధరంబు కనకదం ♦ డంబుగాఁగ
తనప్రతాపసమగ్ర ♦ దావాగ్నిశిఖకు వ్యో
మంబు తదగ్రధూ ♦ మంబుగాఁగఁ
దననిరర్గళ దాన ♦ ధారాంబు లహరికిఁ

కైలాసశిఖరి సై ♦ కతముగాఁగఁ
దనకటాక్షస్యంది ♦ ఘనకృపారసవృష్టి
కఖిలార్థికోటి స ♦ స్యంబుగాఁగ
గీ. మహినిఁజెలువొందె మత్తారి ♦ మండలేశ
మకుట మణిగణ శాణాయ ♦ మాన చరణ
నఖరపాళి నిజాశ్రిత ♦ నళినహేళి
చారుకీర్తిఁ హరిశ్చంద్ర ♦ చక్రవర్తి.

(కవిజనరంజనము 1 ఆ॥ 28 ప॥)

V

చ. తలుఁలరనిక్కఁ బూఁతనెఱ ♦ తావియచిక్క నపాంగమాలికల్
మెఱుఁగులుగ్రక్క నూరుపుల ♦ మేలిమిఁ దేఁటులుచొక్క హారముల్
కుఱుచలుఁద్రొక్క ముంగురులు ♦ గ్రొంజెమటంబదనెక్క వేలుపుం
దెఱవయొకర్తు చేదిజగ ♦ తీపతికిన్ శిరసంటె వేడుకన్.

(వసుచరిత్రము 5 ఆ॥ 75 ప॥)

చ. జిలుఁగుపయంటదూల నునుఁ ♦ జెక్కుల లేఁజెమరంకురింప గు
బ్బలు నటియింపఁ దాళగతి ♦ బంగరు గాజులుమ్రోయ హారము
ల్మెలిగొన నూర్పులుప్పతిల ♦ లేనడుమల్లలనాడ మెల్లనే
యళికులవేణియోర్తుఁ శిర ♦ సంటెను గెంజిగురాకుబోఁడికిన్.

(కవిజనరంజనము 3 ఆ॥ 26 ప॥)

ఇటులనే యింకను మనుచరిత్రము మొదలగుగ్రంథము లలోని పద్యములను బోలినపద్యము లిందు నక్కడక్కడనున్నవి. కాని గ్రంథవిస్తరభీతిచే వాని నిటఁజేర్పమానితిని. ఇట్టి యనుసృతులను దమకవితలోఁ జూపించుటయే గొప్పగా నెంచినయాం కాలపుఁ గవితా పరిపాటి ననుసరించి సూరకవి వసుచరిత్రాది

ప్రబంధముల కవిత్వరీతులను గైకొని యన్వర్థాభిధాన మగు నీకవిజనరంజనమును జెప్పి యున్నాఁడు. ఈ యనుసరణములు కవియొక్క ప్రతిభకును గవితా సామర్థ్యమునకును గొఱంతగా నెన్నఁబడరాదు గదా ? సరసకవితా సామ్రాజ్యపట్టభద్రుఁడగు పెద్దనార్యుఁడు మారన మార్కండేయ పురాణ మనుసరింప లేదా ! ఏదియెట్లున్నను సూరకవి మాత్రమీకృతిని మిగుల సరసముగను శ్లాఘనీయముగను గావించెనని చెప్పకతప్పదు.

## సూరకవి కవిత్వమునందలి యర్థాలంకారములు.

అర్థాలంకారము లనేకము లీకవి యీప్రబంధమునఁ బ్రయోగించియున్నాఁడు. అట్టియలంకారములుగల పద్యములఁ గొన్నింటి నీదిగువఁ జూపుచున్నాఁడను.

1. ఉపమ:—

చ. పురనికటాంచితోపవన ♦ పుష్పితసాలములం గదల్చుచున్
సరసులఁదేలుచున్ సుమర ♦ జఃపటలంబులఁ గొల్లలాడుచున్
నురుచిరకుంజపుంజములఁ ♦ జొచ్చినటించుచు మందగాముఁడై
కరులవలెంజరించుఁ జలి ♦ గాడ్పులు షట్పదశృంఖలల్దగన్.
(కవిజనరంజనము 1 ఆ॥ 16 ప॥)

2. క. కలశాబ్ధిభంగి వెన్నెల
పొలిచెం దెలిదీవిశీవిఁ ♦ బూర్ణసుధాంశుం
డలరె నచటనున్న రమా
లలనాధిపుభంగిఁ దత్క ♦ ళంకంబొప్పెన్.
(కవిజనరంజనము 3 ఆ॥ 83 ప॥)

2. ఉత్ప్రేక్ష:—

(1) చ. అనుపమహేమసద్య ఘటి ♦ తాంచదనంత మణిప్రభాళిచే
ననయముఁ దత్పురీవర మ ♦ హాగృహముల్ రెయిదోఁచకుండఁగా
నొనరుచు టింజుమీ గృహము ♦ లొప్పు నిశాంత సమాహ్వయంబులన్
వినుతియొనర్పఁగాఁ దరమె ♦ వీటనుగల్గిన రత్నసంపదల్.

(కవిజనరంజనము 1 ఆ॥ 19 ప॥)

ఉ. యామవతీవధూటి బిగి ♦ యారఁ గవుంగిటఁ జేర్చుటం దదం
గామలచందనంబు మఱి ♦ నంటెననం దెలుపయ్యె బింబమా;
కోమలగాత్రి గబ్బిచను ♦ గుబ్బలకస్తురి అొమ్ము సోకనో
నా మహిఁ దత్కళంకము గ ♦ నంబడెఁ గల్వల తేనికయ్యెడన్.

(కవిజనరంజనము 3 ఆ॥ 75 ప॥)

3. రూపకము:—

1. గీ. చన్నుగొండలకెల్లవల ♦ సంభవించు
బాహులతలజనించిన ♦ పల్లవములు
పడఁతికెంగేలు తత్కర ♦ పల్లవముల
జననమొందిన కళికలు ♦ సకియగోళ్లు.

(కవిజనరంజనము 1 ఆ॥ 57 ప॥)

2. సీ. చిగురాకుటెఱసంజ ♦ జిగికెఁ బాండురకోర
కములు భాసురతార ♦ కములుగాఁగఁ
బ్రసవ రసాసార ♦ పటిమంబునను రాలు
కుసుమము ల్వడగండ్ల ♦ గుంపుగాఁగఁ
బ్రవహించు మధునిర్ఝ ♦ రములకుఁబుప్పొళ్ళ
నెఱితిప్పలినుక తి ♦ న్నియలు గాఁగ

మంజుతరనికుంజ ♦ కుంజరంబులకు రో
లంబముల్ శృంఖలా ♦ లతలుగాఁగఁ
తే. బ్రసవకిసలయ ఫలరస ♦ రసికమధుక
ర పిక శుక నికరారవా ♦ క్రాంత దశ ది
గంతరాళము దనరె వ ♦ సంతకాల
మఖిలభూజన రంజనం ♦ బగుచునంత.

(కవిజనరంజనము 2 ఆ॥ 5 ప॥)

4. అతిశయోక్తి:—

సీ. మేనుమించులఁ జేసి ♦ వాని చాంచల్యంబు
వాలుఁగన్నుల యందుఁ ♦ గీలుకొలిపి
శశిసెమ్మొగమొనర్చి ♦ చందురునందలి కప్పు
కుటిలాలకములందుఁ ♦ గుదురుపఱిచి
కెంపువాతెఱఁజేసి ♦ కెంపుకాఠిన్యంబు
బటువు గుబ్బలయందుఁ ♦ బాదుకొలిపి
విరులు గోళ్ళొనరించి ♦ విరులసౌరభ్యంబు
నిట్టూర్పుగాడ్పుల ♦ మట్టుపఱచి
తే. నలువఁ గావింపఁబోలు నీ ♦ చెలువనార
యనఁగఁజెలువొందె నాచాన ♦ హంసయాన
యమృతపుంబావి యరిదియం ♦ దములదీవి
యాణిముత్తెమ్ము వలరాజు ♦ నలరుటమ్ము.

(కవిజనరంజనము 1 ఆ॥ 70 ప॥)

2. క. లోకాలోక మహీధర
మేకోట, కులాచలము లె ♦ కృతకాద్రులు, కే

శాకూటులుజలరాసులు,
శ్రీకరధృతిసొందుఁడౌ హ ♦ రిశ్చంద్రునకున్.
(కవిజనరంజనము 1 ఆ॥ 29 ప॥)

5. ఉల్లేఖము:—

1. చ. వలపులకున్నిదాన మలి ♦ వారముకోరనికోర్కి జాతికిం
దలఁపనికీడు పాంథ సము ♦ దాయము పాలిటివేటువిత్తు కో
కిలములనోముపంట స్మర ♦ కేవల శౌర్యహుతాశధాయ్యరా
చిలుకలభాగధేయమిలఁ ♦ జెన్నలరారె వసంతమంతటన్.
(కవిజనరంజనము 2 ఆ॥ 3 ప॥)

2. క. చిలుకల చదువులబడులయి
యలులకుఁ బానీయశాల ♦ లయి కోకిలముం
డలముల కామెతలయి వల
పులకునిదానంబులగుచుఁ ♦ బొలిచెందరువుల్.
(కవిజనరంజనము 2 ఆ॥ 7 ప॥)

6. అర్థాంతరన్యాసము:—

గీ. ఇంతిసౌందర్య రేఖాది ♦ దృక్కుచేత
నెపుడు తెరవంతురను, వంచి ♦ నపుడుగోరు
నిమిషపరికల్పితాంత రా ♦ యమువిదిర్చ
భూమిపతులందు వాంఛాప్తి ♦ పూతిఁగలదె.
(కవిజనరంజనము 3 ఆ॥ 37 ప॥)

గీ. విసముఁగంఠంబునను దాల్చి ♦ విసముకంటె
నతిభయంకరమూర్తివీ ♦ వని శశాంక!
యుత్తమాంగంబునందు ని ♦ న్నుంచెహరుఁడు
వ్యర్థమే శర్వసర్వజ్ఞ ♦ వైభవంబు.
(కవిజనరంజనము 2 ఆ॥ 40 ప॥)

7. ప్రతీపము:—

1. క. పుడమింబోటియలు దూలెడు
పిడుగులు నడవులనెడాఁగు ♦ బెబ్బులిగుహలం
దడఁగెడు సింహముసరియే
వడిగలతనమునను రాచ ♦ వారికిపేటన్.

2. సీ. ఎలనాగ పల్కుల ♦ కెనగావటంచునో
చెవియొగ్గి వినఁడయ్యెఁ ♦ జిలుకపల్కు-
లింతినెమ్మోముతో ♦ నీడుగాదంచునో
తళుకుటద్దముఁజూడఁ ♦ దలఁపఁడయ్యెఁ
బూఁబోఁడి బాహలఁ ♦ బోలలేవంచునో
పూవుదండలు మేనఁ ♦ బూనఁడయ్యెఁ
బోలఁతిమైతావితోఁ ♦ బురుడుగాదంచునో
మొనసి శ్రీగంధంబు ♦ ముట్టఁడయ్యె
గీ. బోటి నిట్టూర్పుగాడ్పుతో ♦ పాటిగాద
టంచునో యుశీరతాలవృం ♦ తానిలంబు
సొంపునను నించుకేనిఁగాం ♦ క్షింపఁడయ్యె
మదనసాయక ఖిన్నుఁడై ♦ మనుజవిభుఁడు.
(కవిజనరంజనము 2 ఆ॥ 16 ప॥)

8. పరిసంఖ్య:—

సీ. బహుభాషణత్వంబు ♦ పటుశాస్త్రసంవాద
చుంచువిద్వజ్జన ♦ స్తోమమంద
క్రూరభావంబత్యు ♦ దారవిలాసవ
చ్చంద్రాననాకటా ♦ క్షములయంద
చంచలభావంబు ♦ సముదగ్రభద్రదం
తావళరాజిహ ♦ స్తములయంద

వక్రీభావంబు దు ♦ ర్వారవిక్రమనము
దృటభటాధిజ్యచా ♦ పములయందె
కాని పురమున జనులందుఁ ♦ గానఁబడద
నంగ సెంతయు నప్పట్టి ♦ ణము చెలంగు
హీరమణిమయ సౌధాగ్రి ♦ హేమకలశ
భాజితస్వర్ణదీస్వర్ణ ♦ పద్మమగుచు.
(కవిజనరంజనము 1 ఆ॥ 25 ప॥)

9. సహోక్తి:—

సీ. తరుణపల్లవ లతాం ♦ తములతోఁ గూడసె
వలరాజు శౌర్యకీ ♦ ర్తులు వెలింగె
నంచితనుమమరం ♦ దాసారములతోన
విరహిణీ బాష్పాంబు ♦ వృష్టిగురిసెఁ
గమనీయ లతికావ్రి ♦ కాండంబు తోడసె
శుకపిక మధుకరో ♦ త్సుకతనిగిడె
మలయానిలాంకూర ♦ ములతోన కాముక
సమితి వాంఛాకంద ♦ ళములు ప్రబలె
భవ్యనవ్యప్రభా పరం ♦ పరలతోన
పరిమళంబులు దట్టమై ♦ పర్వెదిశల
సకలబుతుసార్వభౌమ వ ♦ సంతబుతువు
త్రిభువనీ మోహనంబయి ♦ తేజరిల్ల.
(కవిజనరంజనము 2 ఆ॥ 4 ప॥)

తే. తమమడరెఁ బాంథజనమోహ ♦ తమముతోడ
వహ్ని వెలుఁగొందె మరుశౌర్య ♦ వహ్నితోడఁ
దారకలు దెల్వొఁగసె నభి ♦ సారికాప
రంపరలతోడ సెంతయుఁ ♦ బెంపుమీఱి.
(కవిజనరంజనము 3 ఆ॥ 64 ప॥)

10. అనన్వయము:—

చ. వనితవిలాసభాగవయ ♦ వంబులకుం బరికించి చూడఁగా
నెన మతిలేవువాని కవి ♦ యే యెనయంచు మదిం దలంచికా
యనుపమతన్మనోజ్ఞకర ♦ భాకృతిగా నొనరించె నూరువు
ల్వనజదళాయతేక్షణకు ♦ వారిజసంభవు నేరుపెట్టిదో.

11. శ్లేష:—

సీ. పద్మాకరములౌట ♦ భవనరాజంబులు
విష్ణుపదంబంటి ♦ వినుతికెక్క
రత్నాకరంబౌట ♦ రమణీయవప్రంబు
గగనస్రవంతితోఁ ♦ గలసి మెలఁగ
సుమనోభిరామత ♦ శోభిల్లుటనుదోఁట
లతులాప్సరస్సమ ♦ న్వితములయ్యె
రాజవత్సులై ♦ రాజిల్లుటను నృపు
లమలదుర్గాధిప ♦ త్యమునమనిరి
భోగులకు నాశ్రయంబయి ♦ పోలుచుకతన
సన్నుతికి నెక్కెనదిబలి ♦ సద్మమనఁగ
నిత్యకల్యాణ లక్ష్మిచే ♦ నెగడుకతన
నాపురంబొప్పు విబుధాల ♦ యంబనంగ.

(కవిజనరంజనము 1 ఆ॥ 28 ప॥)

మ. అమృతాంభోనిధి లక్ష్మితోడనుద ♦ యంబై రాజనంబొల్చి తో
రముగా సత్పథవర్తినా నెగడి స ♦ ర్వజ్ఞావతంసుండనై
కమనీయాఖిల సద్గుణంబుల నుతు ♦ ల్గయికొన్నని న్నెన్నఁ శ
క్యమె యీయయ్యుత్పల పత్త్రిలోచను గృహం ♦ గాషాఢుధాకాశికిన్.

(కవిజనరంజనము 2 ఆ॥ 30 ప॥)

తే. కొమ్మల గదల్చునెప్పుడుఁ ♦ గమ్మగాలి
విధుతనయుఁడు మనోజ్ఞుఁడు ♦ మధుఁడు జాతి.
వైరిదోషాకరుండు డుడు ♦ వల్లభుండు
గలికి వీరికినుగుణంబు ♦ గలుగుటెట్లు.
(కవిజనరంజనము 2 ఆ॥ 34 ప॥)

12. భ్రాంతిమంతము:—

మ. అతులోత్సాహము లుప్పతిల్లనిక ♦ టోద్యానంబులం బొల్చు శే
కితతుల్వీటను జితనిర్జనకలా ♦ కేలిన్విజృంభించు భ
వ్యతరాభ్రంకష రత్నసౌధపటలీ ♦ వాతాయన వాతని
ర్గతకాలాగరుధూపధూమ్యలు మెయి ♦ ల్గానెంచియెల్లప్పుడున్.
(కవిజనరంజనము 1 ఆ॥ 21 ప॥)

మీఁదఁజూపిన యలంకారములు గాక యింకను మఱి కొన్నిగలవు. కాని గ్రంథవిస్తరభీతిని ంతటితో విరమించితిని.

సరసమగు నర్థమునే మిక్కిలిగ నపేక్షించిన కారణము చేత నీకవివరుఁడు వాగాడంబరమున కాశించి శబ్దాలంకారము లనంతగాఁ బాటింపలేదు. కాని యర్థసందర్భమునకు భంగము లేకుండయుచితమైన శబ్దాలంకారములను గూడ నచ్చటచ్చటఁ గవివాడి యున్నాఁడు:—

× × × × ×

1. అనఁగఁ జెలువొందినా చాన ♦ హంసయాన
యమృతపుంబావి యరిది యం ♦ దములదీవి
యాణిముత్తెమ్ము వలరాజు ♦ నలరుటమ్ము.

× × × × ×

2. సరసనిభమూర్తి వినిహిత ♦ సంశ్రితాతిక
సాధుశీతికనాశీర్వాదంబు ♦ చక్రినర్తి.

## — సూరకవి కవిత్వము. —

సూరకవికిఁ బిదపనో లేక యతఁడు జీవించియున్నకాలముననో యీకవిజనరంజనము పండితుల యాదరణమునుబొంది యాంధ్రకవి ప్రపంచమున నబ్బయామాత్య కృతమగు కవిరాజ మనోరంజనము మొదలగు గ్రంథములతో పాటు పిల్లవసుచరిత్రమను ప్రసిద్ధిగాంచినది. అట్టి ప్రసిద్ధిని బొందుటకు దీనియందలి వసుచరిత్రపుఁబోలిక లోకకారణమయి యుండుట యటుండ గ్రంథమునందలి వర్ణనాంశముల పట్లఁగవి చూపిన ప్రౌఢిమయు రసపోషణమును బ్రధాన హేతువులై యుండవచ్చునని తోఁచెడిని. కథావిన్యాసమునఁ గల్పనా కౌశలమును జూప నవకాశము లేక పోయినను గవి వర్ణనాంశముల పట్లఁ దన ప్రౌఢిమను జూపి యాధునిక ప్రబంధకవీశ్వరులలో నుత్తమ స్థానము నధిష్ఠించెను.

ఈకవివరునకు సంస్కృతాంధ్రముల యందుఁ జక్కని వైదుష్యము కలదు. ఇతఁడు సంస్కృతమున నాటకాలంకార సాహిత్యము కలవాడగుటయే గాక పాణినీయ వ్యాకరణజ్ఞుండును గూడనై యుండినట్టుగ నీతని గ్రంథములను బట్టి తెలియవచ్చెడిని. కవిసంశయ విచ్ఛేదములోని.

గీ. ఆంధ్రమర్మంబుఁ దెలియంగ ♦ ననువుపడునె
ప్రకటసంస్కృత రచితసూ ♦ త్రములచేత

నవనిఁబాణిని ఘటితసూ ♦ త్రార్థసరణి
తెనుఁగు టీకలచేత సా ♦ధింపనగునె.

అను నీపద్యమును బట్టియు, శ్రీరామదండకములోనిసంస్కృతపద భూయిష్ఠమగు రచనను బట్టియు, కవిసంశయ విచ్ఛేదములో నితఁడు వాడిన "ల్యప్పు" మున్నగు వ్యాకరణపరిభాషను బట్టియు నితనికి సంస్కృత వ్యాకరణమునఁ జక్కని జ్ఞానముకలదని నూహింప వచ్చును.

సర్వవిధముల నుత్తమ కవిత్వమనిచెప్ప నొప్పునది యెట్లుండవలెనో సూరకవి, తనకవి సంశయ విచ్ఛేదములో నిట్లుచెప్పియున్నాఁడు.

* సీ. యతి, యుక్తవాక్యాను ♦ గతినంటవలయు వ
త్సంబుధేనువు వెంటఁ ♦ దవిలినట్లు
మెట్టు మీఁదనుగాలు ♦ పెట్టఁగ దండ యం
దిచ్చినట్లులు ప్రాస ♦ మెనయవలయు
సానఁబట్టిన మణి ♦ చందానఁబదమర్థ
నారీశుభంగిబం ♦ధంబువలయు

---

* సూరకవి యీయభిప్రాయమునే తన యితరగ్రంథముల యందుఁ గూడఁ దెలిపి యున్నాఁడు—

1. గీ. కవితనేరుపుయతి గూర్చు ♦ కరణిదెలుపు. (రామలింగేశ శతకము)

2. క. యతి దవలవలయు వాగను
గతి ధేనువువెంట నంటి ♦ కదలెడు వత్సా
కృతి నదియె కవనచతురిమ
వితరణఖని! పొణ్గుపాటి ♦ వేంకటమంత్రీ.
(వేంకటమంత్రి శతకము.)

దివిపెట్టుంగు మెఱుంగుఁ ♦ దీఁగెయట్లర్థంబు
తేటతెల్లంబుగాఁ ♦ దెలియవలయు
గీ. నలఁతి తొలపడ్డ చంద్రిమం ♦ డలమువలన
జలజలను రాలునమృతంపు ♦ జాలులీల
రసముతులకింప వలెనట్టి ♦ రమ్యకవిత
రసికరసనా రిరంసచేఁ ♦ బ్రబలకున్నె.

ఇట్టి యాదర్శమును దనముందిడుకొనిన వాఁడగుటచేత నే సూరకవి యీప్రబంధమును గవిజనహృదయా వర్జకముగ నొనర్చి యన్వర్థాభిధానముగఁ జేసి యున్నాఁడు.

కథా సంవిధానమునఁ జెప్పఁబడిన చంద్రిమతీ హరిశ్చంద్రులయన్యోన్యానురాగబీజము వారివారిచిత్రపటములను నొండొరు లుపలక్షించుట చేతనే మొలకలెత్తిన దనిచెప్పియు బ్రాహ్మణసందేశమునుజొనిపియు సంభావ్య విషయనిరూపణము గావించి, యిరువురు రాజ్యాధిపతులు వియ్యమందిన విధమునఁ జంద్రిమతీ హరిశ్చంద్రుల వివాహమహోత్సవమును క్షత్రియోచిత మర్యాదల ననుసరించి మిగుల మనోహరముగ నభివర్ణించియున్నాఁడు. దృఢవ్రతుఁడను బ్రాహ్మణుఁడు హరిశ్చంద్రుని దరికి దూతగావచ్చిన సందర్భమున నాయతిథిని హరిశ్చంద్రుఁడు పూజించుటలో వైదికసంప్రదాయము ననుసరించి సంస్కృతభాషామయముగ నతిథి సత్కారవాక్యములనుగవియిట్లు నడపియున్నాఁడు.

సీ. వందనం తే విప్ర ♦ పల్లభాద్రిమసార్వ
భౌమ తుభ్యం సదా ♦ భద్రమస్తు
అత్రోపవిశ భవ ♦ దాగమనం కుతో
విజయాస్పద పురాద్వి ♦ వేకధుర్య
తవనామకిం ద్విజో ♦ త్తమ దృఢవ్రత ఇతి
ప్రాహుర్మనీషిణః ♦ పార్థివేంద్ర
యుష్మదాగమన ప్ర ♦ యోజనం కిం విప్ర
రహసివక్ష్యే ధరా ♦ రమణవర్య

గీ. యనుచు నన్యోన్యపరిభాష ♦ లాడి పిదప
సముఖమందున్న యాశ్రిత ♦ జనుల నెల్ల
వేఱొక నెపంబుఁ గల్పించి ♦ వీడుకొల్పి
మంతనంబుండె వసుమతీ ♦ కాంతుఁడపుడు.

బ్రాహ్మణ పూజయునందును నతిధిపూజయు యజ్ఞములే యనఁ జనునుగాన (యజ్=To worship) నట్టి యజ్ఞవిషయమున వికృతిభాష నుపయోగించుటకన్నఁ బవిత్రమగు గీర్వాణభాష నుపయోగించిన నుచితతరముగా నుండుననిసకలాగమ సంప్రదాయాభిజ్ఞుఁడగు సూరకవి తలంచెనా యని యాలోచింపవలసి యున్నది. "వాగ్యోగవిద్దుష్యతి చాపశబ్దైరితి స్మృత్యనుమిత్య వగమ్యమానోప శబ్దనిషేధోపి క్రతువిషయ ఏవ..............................అత ఏవ వ్యాకరణమహాభాష్యేసర్వోప్యప శబ్దనిషేధః క్రతు విషయఏవ నతు వ్యవహారవిషయ ఇతి ప్రతిపాదితం, తతస్స్వదేశ భాషాభిమానధారే

యాఃపండిత శశాంకాః నిశ్శంకాస్స్వదేశ భాషాకావ్య నిర్మా
ణేపిప్రవర్తంతే ఏవ.

(అహోబల పండితీయము. 69 పేజీ.)

అను నహోబల పండితుని ధోరణినిబట్టియు నాతఁడుదా
హరించిన మహాభాష్య ప్రమాణమును బట్టియు యజ్ఞవిషయ
మున దేశభాషల నుపయోగించుట నిషిద్ధమని తేలుచున్నది
గదా! ఇట్టి గంభీరమగు సూరకవి యాశయమును బరిశీలించు
వారికెల్లను నాతనికిఁగల సంస్కృతవ్యాకరణ జ్ఞానమును నహో
బలపండితీయాదు లందలి పాండిత్యమును, వైదిక సంప్రదాయా
భిజ్ఞతయు నుచితజ్ఞతయు విశదపడక మానవు.

ఇంక నితనికవితా విశేషములను గూర్చి కొంచెముచెప్ప
వలసి యున్నది. సూరకవికవిత్వమునంస్కృతపదభూయిష్ఠమై మృ
దుమధురమై యనర్గళధారకలదై కదళీపాకమున విరాజిల్లుచు
"కవితాతత్త్వంబు సూరకవికే తెలియుఁ" అను నాతని సమ
కాలికుల యభిప్రాయమును దృఢీకరించు చున్నది. ఇతని కవి
తనుగూర్చి పండితులొసఁగిన యభిప్రాయముల నీదిగువఁబొందు
పఱచు చున్నాఁడను.

"అడిదము సూరన—ఇతఁడొక సుకుమారకవి. కవి
జనరంజనమను నొక్క చిన్నకావ్యమును రచియించిన వాఁడు.

దానిని పిల్లవసుచరిత్ర మని చెప్పుదురు. అది తన పడసిన నామము సన్వర్థనాము చేయుచున్నది."

× × × × ×

బహుజనపల్లి సీతారామాచార్యులవారు-(శబ్దరత్నాకరము పీఠిక.)

" ఇతఁడు చేసినగ్రంథములలో నెల్ల చంద్రమతీపరిణయమను నామాంతరము గల కవిజనరంజనము మిక్కిలి మనోహరమైనది. ఇది మూఁడాశ్వాసములు గల చిన్న ప్రబంధమైనను, దీనియందలి గుణసంపదను బట్టి పండితులు దీనిని పిల్లవసుచరిత్ర మని వాడుచున్నారు.

× × × ×

రావుబహదూరు క౦॥ వీరేశలింగము పంతులుగారు-
(ఆంధ్రకవుల చరిత్రము 3 వ భాగము.)

" సరసకవిత్వవైభవ" అని యీకవి వ్రాసికొనిన బిరుదు సార్థకమని మెన్నుచున్నారము. ఇతఁడు రచించిన కవిజనరంజనము చదివిన కొలఁది ధ్వనులీనుచు మాధుర్యముం జిలికించుచున్నది. ఆ గ్రంథమన్ని విధముల వసుచరిత్రను బోలి కొన్నిచోట్ల మించి యొప్పుచుండుటచేతనే దాని కప్పటివారు పిల్లవసుచరిత్రమని పేరిడిరి. కవిత్వము హృద్యముగానుండును. ధ్వనియే ప్రధానముగా నెంచి కావ్యగుణములకే భంగముఁ బొరలకుండ

గ్రంథములను రచించి నలుగురొనసఁ జేరుబ్రతిష్ఠలఁ గాంచి యీకవి మించెను. ఈతని కవిత్వమున నఱువదిపాళ్ళు సంస్కృతమును నలువదిపాళ్ళు తెనుఁగునుగలదు.

× × × × ×

రాజా మంత్రిప్రగడ భుజంగరావు బహద్దరుగారు—
(చంద్రాలోకమునకు నుపోద్ఘాతము.)

“ ఈతఁడనేక గ్రంథంబులు రచియించె. అందుఁజంద్రమతీపరిణయము లేక కవిజనరంజనమను నది ప్రబంధము. ఇది ప్రబంధమనఁదగి దాని రచియించిన కవిపేరు శాశ్వతమై భూమియందుండు నట్లొనర్చె. ”

గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు—(కవిజీవితములు.)

“ ......వసుచరిత్రములోని కల్పనములను గథపట్టులను ననుసరించి చెప్పినవారిలో ముఖ్యుల గ్రంథములు పిల్లవసుచరిత్రములని ప్రసిద్ధినిజెంది యున్నవి.

× × × × ×

అడిదము సూరకవి ప్రణీతమగు కవిజనరంజనములోని వర్ణనములును సరసముగనే యున్నవి. కాని యిందుఁగథా భాగమేమియుఁ గానరాదు.

× × × × ×

వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు—(వసుచరిత్రవిమర్శనము.)

కవిసంశయవిచ్ఛేదము:—ఇది మూఁడు ప్రకరణముల లక్షణగ్రంథము. ఇందలి ప్రకరణములకుఁ దరంగములని పేరు. అందు మొదటి రెండుతరంగముల యందును గవి తనకుఁబూర్వమున నున్న వ్యాకరణములలో లేని కొన్ని నూతనవిషయములను జేర్చి వానికి సూత్రములుగల్పించి లక్ష్యములను భారతాదిగ్రంథములనుండి చూపియున్నాఁడు. రెండవ తరంగమునందు శకటరేఫనిర్ణయమును గూర్చికొంతవఱకును, మూఁడవ తరంగమునందుఁ దద్భవములు గలిగిన విధమును గూర్చి కొంతవిపులముగను వివరించి యున్నాఁడు. దీనియందుఁ దాను జేసిననియమములను సూరకవి యిట్లు చెప్పియున్నాఁడు.

క. కవిజన సంజీవనిలోఁ
దవిలినపద్ధతులు మఱి యి ♦ తరలక్షణల
క్ష్యవినిర్దిష్టగతులు చె
ప్పవలయునని వేఱయొక్క ♦ పద్ధతి చేతన్.

క. ప్రియమందఁగఁ గవులు కవి
త్రియనుకవిత్వాను సరణి ♦ దప్పక కవిసం
శయవిచ్ఛేదంబను నా
హ్వాయమిడి లక్షణమొనర్తు ♦ నార్యులు మెచ్చన్.

భారతాదిగ్రంథముల యందు మహాకవులు ప్రయోగించిన ప్రయోగములను సూరకవి లక్షణసమ్మతములుగా సాధించి యుదాహరించెను. అట్టివానిని గొన్నింటి నీదిగువఁ జూపుచున్నాఁడను.

1. లక్షణము:—

గీ. ఇడఁగవచ్చును ల్యబ్వ్యాపై ♦ నిత్యసంధి
మాత్ర మొక్కొక్కచోటను ♦ మట్టుమీఱఁ
గొలుతు నఘమడంపఁ ♦ గోరిందుశేఖరు
నన్నయాద్యులు కవిజ ♦ సాధుమతిని.

ప్రయోగము:—

1. క. ఇతఁడుమదీయ పురోహితుఁ
డితనికిఁదగనెల్ల పనుల ♦ తెంగించిపుడే.

(ఉద్యోగపర్వము)

2. క. ......................
జమ్మిక్షసంతాప్రిఁకి విడిచి ♦ చాపమునాకం
దిమ్మనుడు...............

(విరాటపర్వము.)

3. సీ. దర్శించి యతనికేఁ ♦ దగుదునో తగనో యి
నించుకించుక నంశ ♦ యింతురాత్మ.

(నైషధము-శ్రీనాథుఁడు.)

4. చ. నిగి డిగపై పులస్వేదల ♦ నేటయినీటగు వీటికోట.

శుద్ధాంధ్రరామాయణము.
(అడిదము బాలభాస్కరుఁడు.)

ఇకారసంధి శ్రుతికటువుగా నుండునని ప్రాచీను లద్దాని నంగీకరింపరయిరి. అట్లయినను శ్రుతికటువు కాని, ఇకారసంధి దుష్టముకాదనియే వారి యాశయము. "..............వా

శా తెలివెందునుం గలదె" (ఉద్యోగ పర్వము. 2 వఆశ్వాసము, 225 పద్యము) అని తిక్కయజ్వ ప్రయోగించి యున్నాఁడు. సామాన్యముగా 'ఇకారము'నకుఁ దాలవ్యాచ్చు పరమగునపుడు సంధిశ్రుతి హితముగానే యుండును. 'ఇకారసంధి' దుష్టమను నిబంధనమునకు, అకారాదిపరకేకార సంధియే దుష్టమనియెన్నఁ దగును. ఆలోచింపఁగా, క్త్వార్థకేకార సంధినిషేధమునుదాలవ్య స్వరపరకస్థలముల యందుఁగాదని మహాకవు లభిప్రాయపడినట్లు స్ఫురించుచున్నది. ఇట్టి భాషాతత్త్వమును గనుపెట్టియు మహాకవుల ప్రయోగరహస్యములఁ గనుపెట్టియు దానినే యనుసరించియున్న సమర్థుఁడగు సూరకవి క్త్వార్థక సంధివిషయమున నట్టి వ్యవస్థ నేర్పఱచి శ్రుతిహితములును మహాకవి ప్రయుక్తములు నునగు నికారపరక క్త్వార్థకసంధులనే యుదాహరించియున్నాఁడు.

2. లక్షణము:—

గీ. కర్మధారయంబు ♦ గావించు చోటను
సూఁదిపలుక వచ్చు ♦ నొక్కచోట
స్ఫటికశ్రుపా విభూఁతిఁ బోలుచున్ ♦ కవుఁడుమాకు
నభిమతార్థ మిచ్చు ♦ నన్నయట్లు.

ప్రయోగము:—

శా. ..........................................చె
ల్వారునాభ్రముఁడు పాఁంచుగాతచిక తి ♦ మ్మాడీశులిమ్మాధిపున్.

[కవులషష్ఠము.]

ఆంధ్రశబ్దచింతామణి యందలి 'సమోస్సతః' అను సూత్రమును బట్టి, యుదంత స్త్రీసమాదులకుఁ బరుషసరళములు పరమగునపుడు ద్రుతాగమము నిత్యముగావచ్చునని తెలుచున్నది. ఈయభిప్రాయమునే * బాలవ్యాకరణములో సంధిపరిచ్ఛేదములోని యిరువదియొదవ సూత్రము విశదీకరించు చున్నది. కాని, ఉకారాంతములగు ధాతుజవిశేషణములు స్త్రీసమములు కాకుండుటను జేసి వానికీయాగమము రాదనియే ప్రాచీనాధునాతనవైయాకరణుల యభిప్రాయము. ‡ బాలవ్యాకరణములోనిసమాసపరిచ్ఛేదమునందలి యేడవసూత్రమున స్త్రీసమశబ్దమును జెప్పియు, మరల ధాతుజవిశేషణ పదమును గ్రహించుటయే, ధాతుజవిశేషణములు స్త్రీసమములు కానేరవన్న సిద్ధాంతమును వెల్లడించుచున్నది. లోకవ్యవహారమునందును మహాకవి వ్యవహారమునందును ధాతుజవిశేషణములకుఁ బరుషసరళములుపరములగునపుడు ద్రుతాగమము లేకుండుటయే తఱచు గానఁబడుచున్నది. అట్లయినను గొన్నిచోట్ల మహాకవి ప్రయోగములలో ధాతుజవిశేషణములకుఁబరుషసరళములు పరములగునపుడు ద్రుతాగమము వచ్చుట లేక పోలేదు.

---

* సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుషసరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు.

‡ కర్మధారయంబు తత్రిక, స్త్రీసమ, ముగంత, ధాతుజవిశేషణపూర్వపదంబయి యుండదు.

మ. వలుకుం దొయ్యలిమాళి, కాంతికనయా ♦ బాగాలునయ్యింతి చె
ప్కులఁ బోలుందెలనాకులు.......................

(పాండురంగమాహాత్మ్యము 1ఆ॥ తెనాలి రామకృష్ణకవి.)

అట్లు వచ్చినప్పుడట్టిచోట్ల, క్వాచిత్కముగా ద్రుతాగమ మువచ్చునని సూత్రించుటయే యుచితమై యుండును. కాని యిప్పటి వైయాకరణు లట్లంగీకరింపక యట్టి స్థలములయందలివి ధాతుజవిశేషణములు గావనియు నవిదేశ్యములగు స్త్రీసమశబ్ద ములయి వేఱుగానున్నవనియు సిద్ధాంతీకరించు చున్నారు. కాని సూరకవి మాత్ర మట్లభిప్రాయపడక, సహజముగాఁ గొన్ని యెడల నట్లుధాతుజవిశేషణములకుసహితము పరుషసరళేతరములు పరములగునపుడును, క్వాచిత్కముగా ద్రుతాగమము గలదని యుదాహరించి యున్నాఁడు.

3. లక్షణము;—

గీ. ధరబుకారాంతశబ్దంబు ♦ ద్వంద్వమైన
శేషయగుచుఁ బ్రవతిఁల్లు ♦ దృఢముగ ను
వతిప్రవరహాయ వాగ్వధూ ♦ నేత్రముఖసు
రాళి పందితపాదాబ్జ ♦ యన్నయట్లు.

ప్రయోగము.

ఉ. ..........................................రామమాం
ధాతృరఘుక్షితీశులు ము ♦ దంబునఁగాచిరె యే యుగంబునన్.

[ఆదిపర్వము.]

ఈయభిప్రాయమునే బాలవ్యాకరణములో సమాసపరి చ్ఛేదములోని యిరువదినాల్గవ సూత్రము (ద్వంద్వంబునందు ఋకారంబునకు రవర్ణంబు విభాషనగు) విశదీకరించుచున్నది. బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశికలో నీసూత్రముక్రింద నీయఁబడిన వ్యాఖ్యానములోని కొన్ని పంక్తుల నిచట నుదాహరించుచు న్నాఁడను.

మీఁది పద్యమునందు "మాంధాతృరఘు క్షితీశులు అనిన ద్వంద్వంబునందు మాంధాతృశబ్దంబు రేఫాదేశయుక్తం బై భారతంబునందున్నట్లు లెంచి యడిదము సూరకవి "గీ. ధర ఋకారాంత..................యన్నట్లు" కవి సం—ప్రథమ. 28 ల. అను పద్యలక్షణమునకు లక్ష్యంబుగాఁ జూపెను. అప్ప కవిపయి పద్యచతుర్థ పాదంబునందు మాంధాతృశబ్దంబు భార తరచనాసమయంబున ఋకారాంతముగానె రచియింపఁబడినదని యెంచి రేఫశ్లిష్టమైన యక్షరంబులకు రేఫశ్లిష్టంబు గాని యక్ష రంబు ప్రాసంబుగా నుండవచ్చునన్న దానికిఁ బయిపద్యం బుదా హరణంబుగా నిరూపించెను. కొన్ని ప్రాచీన భారతపుస్తకముల యందు రేఫయుక్తంబుగాను, మఱికొన్నిటి యందు రేఫవిరహి తంబుగాను మాంధాతృశబ్ద ముండవచ్చును. కావునఁ బూర్వో క్తకవులిద్దఱును నుభయవిధంబుగా నభిప్రాయపడిరి. శాస్త్రం బున 'మాంధాతృరఘుక్షితీశులు' అన్న ద్వంద్వంబులో రఘుక్షి తీశ శబ్దంబు సమాసచరమావయవంబు (కడపటి పదంబు) కాన

డానికిఁ బూర్వంబునందున్న మాంధాతృశబ్దంబునకు శేషాదేశం బురావచ్చును. ” (పేజీ 200.)

4. తద్భవపదలక్షణము:—

గీ. ద్విత్వవర్ణంబు లకును మీఁ ♦ దిదియయొండెఁ
గ్రిందిదియ యొండెఁ దొలఁగును ♦ జెందుడుమువు
లొక్కకొన్ని పదంబుల ♦ నరగభూమ
కలుగు బంధుత తటవర్గ ♦ ములకు శర్వ.

క. ఋత్వమునకు నిత్వమునకు
నేత్వముసిద్ధించు నొత్వ ♦ మొనయును నుత్వం
బాత్వమునకు నొత్వంబగు
నైత్వం బేత్వమగు నుమశ ♦ రాననమథనా.

సూరకవి యేలకో లక్షణమును జెప్పుచు లక్షణభాగము నుదేటగీతిలోను లక్ష్యభాగమును అంట వెలదిలోను నొకేపద్యమున వ్రాసియున్నాఁడు. మీఁద నీయఁబడిన ‘ ఇడఁగవచ్చును ల్యప్పు పై నిత్యసంధి ’ అను పద్యమే దీనికిఁదార్కాణము. ఇదెంతయు వింతగాఁ జూపట్టుచున్నది.

సూరకవియుఁ గూచిమంచి తిమ్మకవియు సమకాలికులు గాఁగనఁబడు చున్నారు. ఆ కారణముచేతఁ గవిసంశయ విచ్ఛేదమును సర్వలక్షణ సారసంగ్రహమును నొకే కాలమునఁబుట్టిన లక్షణగ్రంథములని చెప్పవలెను. తిమ్మకవి గ్రంథము సూరకవి గ్రంథముకంటె నిస్సంశయముగ విపులతరమగు గ్రంథమని చెప్పవలసి యున్నది.

౩ చంద్రాలోకము:—ఇది యొకయలంకారశాస్త్రము. దీనిని బీయూషవర్షబిరుదాంకితుఁడగు జయదేవమహాకవిసంస్కృతమున రచియించెను. ఇందలి భాగములకు మయూఖములని పేరు. అవిపది. అందు నైదవ మయూఖములోని యర్థాలంకారములను నూటిని దీసికొని సూరకవి తెనిఁగించెను. సంస్కృతచంద్రాలోక కతృత్వము నేలకో సూరకవి కాళిదాసున కారోపించుచు నిట్లొకపద్యమును జెప్పి యున్నాఁడు.

గీ. బాలురకునైనఁ దెలియంగఁ ♦ గాళిదాసు
మునురచించెఁ జంద్రాలోక ♦ మునుదిలింగ
భాషఁ జేసితి నీకృప ♦ భవ్యముగను
దీనిఁ గరుణించి కైకొమ్ము ♦ దేవదేవ.

ఈవిషయమున సూరకవి పొరపాటు పడెనని చెప్పకతప్పదు. ఏలయనఁ జంద్రాలోకమను దానినిఁ గాళిదాసురచించినట్టు గాని యట్టిది ప్రచారమున నున్నట్టు గాని తెలియరాదయ్యెను. ఒకప్పుడు సూరకవికి దొరకిన సంస్కృత గ్రంథమున 'కాళిదాసకృత చంద్రాలోకమని' యుండిన నుండవచ్చును. ఆ వ్రాఁత యందలి యథార్థమును బరిశీలింప నవసరము లేదనుకొని సూరకవి యీతీరునఁ బొరపడియుండిన నుండవచ్చును. ఈరీతిగ భ్రమపడిన వారింకొకరగపడు చున్నారు. వారు పురాణనామచంద్రికను వ్రాసిన యెనమండ్రం వేంకటరామయ్యగారు. ఆయన తమ గ్రంథములో నిట్లువ్రాసి యున్నారు:—

చంద్రాలోకము—ఒక యలంకార శాస్త్రము. ఇది కాళిదాసకృతము. (పు॥ నా॥ చం॥ 67 వ పేజీ.)

ప్రకృతమున నీయాంధ్ర చంద్రాలోకమునకు మాతృక యేదియో తేలవలసి యున్నది. పరిశీలించి చూడఁగా సూరకవి జయదేవ కృతమగు చంద్రాలోకములోని యర్థాలంకార మయూఖమునే తెనిఁగించినట్టుగఁ గనఁబడుచున్నది. కాని శ్రీయుత అక్కిరాజు ఉమాకాంతముగా రభిప్రాయ పడిన ట్లప్పయ దీక్షితుల వారి కువలయానందకారికలను దెనిఁగింప లేదు. ఉమాకాంతముగారు తమ యాంధ్రచంద్రాలోక పీఠికలో "తన నాదరించిన వేంకటపతిరాయలను దీక్షితుఁడు శతాలంకారములలోఁ జివరదియైన హేత్వలంకారము యొక్క లక్ష్యమునందు స్మరించెను. ఆలక్ష్యమిది. "లక్ష్మీవిలాసావిదుషాం కటాక్షా వేంకటప్రభోః॥" సూరకవి యీలక్ష్యమునే.

గీ. కార్యకారణములకు నై ♦ క్యమగు నేనిఁ
గృతులఁగొందఱు హేత్వలం ♦ కృతియయండ్రు
సత్కవులకున్ రమావిలా ♦ సములు వేంక
టేశ్వరకటాక్షములనంగ ♦ నిండుమాళి.

అని యాంధ్రీకరించెను. కనుక సూరకవి కువలయానంద కారికలనే యాంధ్రీకరించెనని, శశవిషాణప్రాయమైన కాళిదాసకృత చంద్రాలోకమును గాని జయదేవుని చంద్రాలోకమును గాని యాంధ్రీకరింప లేదని స్పష్టమగుచున్నది" అని వ్రాసి యున్నారు.

కాని యిందును బొరపాటులు గలవు. 'లక్ష్మీవిలాసాద్విదుషాం కటాక్షా వేంకటప్రభోః॥ 'అనుదీనియందలి 'వేంకటప్రభోః' అను దానిఁబట్టి దీక్షితుల వారు తమ పోషకులను స్మరించిరనివ్రాసిరి. కాని యియ్యది జయదేవ కృతచంద్రాలోకముననే కాన వచ్చుచుండుట చేత సుమాకాంతముగారి యూహ సరికాదని చెప్పవలెను. ఇచ్చటి వేంకటప్రభు శబ్దమును దైవపరముగాఁ దీసికొనవలెను గాని ప్రభుపరముగాముడివేయరాదు. కాఁబట్టి సూరకవి యాంధ్రీకరణమునకు జయదేవుని గ్రంథమే మూలమని తలఁపవలెను.

సూరకవి యాంధ్రీకరణము సంస్కృత చంద్రాలోకమునకుఁ జాలవఱకు దగ్గఱగనే యున్నది. అప్పయదీక్షితుల వారి గ్రంథసహాయము నితఁడపేక్షింపక పోలేదు. అవసరమగు పట్లఁ గువలయానందములోని విషయముల నితఁడు గ్రహించి వాడుకొనెను. మొత్తము మీఁద సూరకవి యాంధ్రీకరణము సరసముగను, ఉపయోగకరముగను నున్నది. ఉదాహరణమునకయి కొన్ని శ్లోకములను, పద్యములను నిచటఁ జూపుచున్నాఁడను.

శ్లో॥ ఉపమా యత్రసాదృశ్య । లక్ష్మీరుల్లసతిద్వయోః ।
హంసీవ కృష్ణతేకీర్తి । స్స్వర్గంగా మవగాహతే ॥
వర్ణ్యోపమాన ధర్మాణా । ముపమా వాచకస్యచ ।
ఏక ద్విత్ర్య నుపాదానా । ద్భిన్నా లుప్తోపమాష్టధా ॥

గీ॥ వర్ణ్యముపమాన ముపమాన ♦ వాచకము స
మానధర్మము సంఘటిం ♦ పనగునుపమ ;

హాంసిచందాన నీకీర్తి ♦ యబ్జనాభ
యభ్రగంగావగాహనం ♦ బాచరించు.

(మీఁదిరెండుశ్లోకములలోని లక్షణములనుండి పూర్ణోపమ లక్షణమును గ్రహించి మూలములోనిలక్ష్యమునేయిచ్చినాఁడు.)

(2) శ్లో॥ చేద్బింబ ప్రతిబింబత్వం । దృష్టాంత స్తదలంకృతిః ।
త్వమేవ కీర్తిమాన్రాజ । న్విధు రేవహి కాంతిమాన్ ॥

క. ప్రతిబింబ ప్రతిబింబా
కృతిఁదగ దృష్టాంతమగును ♦ నృపనీవనఘు
న్నతకీర్తి సమన్వితుఁడవు
సితకిరణుఁడు కాంతియుతుఁడు ♦ క్షితినను పోల్కన్.

(ఈపద్యము మూలమునకు సరిగనున్నది.)

(3) శ్లో॥ ప్రశ్నోత్తరాంతరాభిన్న । ముత్తరంచిత్రముత్తరం ।
కేదారపోషణరతాః । కేఖేటాః కించలంవయః ॥

క. పరగఁ గృతులందుఁ బ్రశ్నో
త్తరమనఁగ నలంక్రియావ ♦ తంసము ప్రశ్నో
త్తరములఁ గలయిన, నెద్ది
శ్వరవాహన మనఁగ సరస ♦ సమ్మతమగుచున్.

ఇచ్చట మూలములోని లక్షణమును మాత్రము గ్రహించి లక్ష్యము నాంధ్రీకరించుట దుస్సాధ్యమగుటచేత వేఱొకటి పొందుపఱచెను.

ఇట్టిరీతులనే దీనిని తెనిఁగించుటలోఁ గవి యనుసరించెను.

4 శ్రీరామదండకము:—సూరకవి యిందుఁదన యుభయ భాషాపాండిత్యమును వెల్లడించుచు రామాయణ కథను సంక్షేపముగా వర్ణించి యున్నాఁడు. ఇందలి కవితాధోరణిని దెల్పుటకయి కొంతభాగము నిచట నుదాహరించు చున్నాఁడను.

“......మాయాకురంగాకృతిన్ రావణప్రేరితుండౌచు మారీచుఁ డేతేర సీతాప్రయత్నంబునన్దజ్జిఘృక్షాపరాయత్తచిత్తుండవై నీవు వోవ న్దశాస్యుండు సీతాసతిన్గొంచు లంకాపురిన్జేర నీవంత మారీచు దున్మాడి తత్పర్ణశాలాసమీపంబున న్జానకిన్ గానకార్తిన్మరారారు ల్మీరారు ల్తరణ్యాంతరు జాలాళరణ్యాంబరణ్యాం బగణ్యాంబు లేవేళల న్వ్యాళశార్దూలశుండాలముల్ హాతటిద్గాత్రి హా మానసాహ్లాదసంధాత్రి హా ప్రేయసి క్వాసి యంచాయరణ్యాని నీవాధరణ్యాత్మజ న్వెన్కఁచున్ రావణోత్కృత్తకాయు న్జటాయు న్నిరీక్షించి నీ శోకబంధున్బడన్జెంది లోకైకబంధుండవై పోల్చియుందందిరా జీవ రాజీవరాజీవరాహాదసంపాది పంపాసరస్తీరదేశంబున న్మైత్రితో మైత్రి గావించివాలిన్మహాసత్వశాలి న్మహోచ్చండకాండాహతి న్గెఁడవే చండవేదండము న్జెందు పంచాస్యమున్బోలి న్నంతట న్భానుమత్సూనునిన్గీశభద్రాసనాసీనుని న్జేసిన న్వాసపై భూసుతాన్వేషణార్థంబు శాఖామృగాధీశుల న్బంపువేళ న్మహావేగవంతున్ హనూమంతు నగ్రక్షణాశావిదేశంబు వెన్క న్నియోగించినన్వాయుసూనుండు భూభృత్సదృక్కర్కటాళీధులీఢాకిలాభ్రంకషాదభ్రవీచీసమాచీనవారాన్నిధి న్జెంగున న్దాటి లంకాపురోద్యానమధ్యంబున న్గ్రూరనక్తంచరీచంచరీకాలకాశోకసీత న్నిరీక్షించి ప్రాంతారవింబోలి సీతారవిందాస్య చేతోరవిందంబు నానంద మొందించి యంత న్నృతోద్యానవిద్రావణుండౌచు శ్వైళాకరాళానలోగ్రాహవాహాంయు న క్తంచరుల్గ్రాల్వ నక్షాదిరక్షోబలాధ్యక్షులేతెంచియుద్వృత్తిమైహత్తిదండెత్తినన్బిండిపింజై సముత్తుంగ మాతంగముల్నుగ్గునుగ్గై తురంగంబులు న్జెక్కు చెక్కై రథాంగంబులు న్నుజ్జునుజ్జై భటాంగంబులు న్నేలపై

గూల నీలిలఁ దత్సైన్య ముద్ధూత చైతన్యముఁ జేసి యుజ్జ్వలకోలాహలాభీలహేలాసముల్లాసియై యతని జెండుచెండాడి త్రిభువనవిత్రాసకృత్యాపేక్షా క్రుద్ధచండవాలాగ్రబద్ధాంశుకపరిస్ఫుర ద్విస్ఫులింగచ్ఛటాభీలకీలాకరాళాగ్ని లంకాపురాగారముల్భస్మసాత్కారముల్సేసి వేశంతమున్బోలె తానాసరస్వంతమున్దాటి నిర్గమించి లంకాపురోద్యాన మధ్యస్థితాం దానవీసంవృతాం త్వద్వియోగవ్యధాక్లిష్టగాత్రీం విదేహేంద్రపుత్రీ మపశ్యం రఘూత్తంస యంచు సుధామాధురీశ్రీధురీణోక్తుల న్విన్నవింపంగ......"

5. ఆంధ్రనామశేషము:—ఇది పద్యరూపమున నున్న యొక నిఘంటువు. పైడిపాటి లక్ష్మణకవి కృతమగు నాంధ్రనామసంగ్రహమునందు లేని పదములను జేర్చి యీనిఘంటువును సూరకవి రచియించినాఁడు. ఆవిషయమునే యతఁడీగ్రంథారంభమున నిట్లుచెప్పి యున్నాఁడు.

గీ. ఆంధ్రనామసంగ్ర ♦ హమునందుఁ జెప్పని
యన్ని తెనుఁగు మఱుఁగు ♦ లరసికూర్చి
యాంధ్రనామశేష ♦ మను పేరఁ జెప్పెద
దీనిఁ జిత్తగింపు ♦ దేవదేవ!

ఆంధ్రపదజాలము నొకచోట నేర్చికూర్చి వివిధవర్గులుగా విభాగించి గ్రంథముగాఁ జేయుటయేమిగులఁ గష్టమగుపని. అట్టి ఘనకార్యమొకరొనర్చిన పిదప దానియందలి విశిష్టభాగములఁ బూరించుట మఱియుఁ గష్టము. ఈకార్యమును సూరకవి కడుశ్లాఘనీయముగఁ జేసి యాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రు

డయ్యెను. ఆంధ్రనామసంగ్రహము వలె నీ శేషముకూడఁ జాల నుపయోగకరమైన నిఘంటువుగాఁ బరిగణింపఁబడి, యాంధ్రులచేఁ బఠింపఁ బడుచున్నది. ఇట్టి గ్రంథములు ప్రాయికముగఁ గవుల కవితాధోరణిని జూపనవకాశ మియ్యనట్టివి. అయినను సూరకవి కవితా ప్రవాహము మాత్రమట్లు విక్కలి పరిణామము నొందక దీనియందును, నిరాఘాటముగా వెలయుచునే యున్నదనుటకు నీక్రింది రెండుపద్యములను బొందుపఱచుచున్నాఁడను.

తే. పెంపుఁ జెందెను, దామర ♦ తంపరయ్యెఁ
బలె, నెగడెను, గౌనసాగ ♦ బలిసెఁ బెరిఁగె
ననఁగఁ గేకేత్తె ననఁగఁ జే ♦ ళ్ళయ్యె వృద్ధిఁ
బొందెననుటకు శేషాహి ♦ భూషితాంగ.

తే. అగపడకపోయె, విచ్చుమె ♦ గ్గయ్యె, ననఁగఁ
గంటఁ బడఁడయ్యెఁ బంచబం ♦ గాళమయ్యె
ననఁగ దృగ్గోచరంబయ్యె ♦ ననుట పేళ్ళు
శయఘటితశూల! నైయాఘ్రి ♦ చర్మచేల!

రామలింగేశ శతకము:—సూరకవి గ్రంథములలో నెల్ల మిగుల జనరంజకమైనదియు, నతనికాలముననే పలువురచే నాదరింపఁబడినదియు నగు నీశతకము క్రీస్తుశకము 1770-1785 సంవత్సరముల మధ్యకాలమున రచింపఁబడినదని యూహించుటకుఁదగిన యాధారములున్నవి. శ్రీవిజయనగర ప్రభువులును కవికి నాశ్రయులునునగు శ్రీచినవిజయరామ గజపతిమహారాజు

లుంగారి రాజ్యకాలమున దివానుగా నుండిన సీతారామరాజు గారి చండశాసనత్వమును, దద్వారమున దేశమునకుఁ గలిగిన ప్రజాపీడయు, నాఁటిసాంఘిక స్థితియు, రాజకీయస్థితియు నిందు నన్యాపదేశముగ వెల్లడించుటయే కవి ముఖ్యాభిప్రాయమైనట్లు గ దీనిఁజదివిన వారికిఁ దప్పక స్ఫురింపక మానదు. సీతారామ రాజుగారు పెట్టిన బాధలే యీగ్రంథము కవి వ్రాయుటకుఁగా రణమని యాంధ్రకవుల చరిత్రమిట్లు నుడువుచున్నది.

“సీతారామరాజుగారిట్లు పరరాజులను జయించుటయే కాక తురకదొరలు మసీదులకిచ్చిన భూములను, పూర్వరాజులు బ్రాహ్మణుల కిచ్చిన మాన్యములను గూడ లాగుకొనిప్రజలను సహితము క్షోభపెట్ట నారంభించెను. ఈయన పెట్టుబాధలే సూ రకవిని రామలింగేశశతకముచేయునట్లు చేసినవి.” ఈ యూహ సరియైనను గావచ్చును. కాని యాకాలపు విజయనగర రాజ్య వ్యవస్థను బాఁగుగ గమనించి చూచినచో సీతారామరాజుగారి చండశాసనత్వమును, పరిపాలనా ప్రావీణ్యమును, రాజనీతి వైదుష్యమును నీపూసపాటి రాజ్యమును గొప్పయౌన్నత్యము నకుఁ దెచ్చుటకుఁ గారణములయినవని చెప్పి తీరవలెను. విజయ నగరము వారికిఁ బక్కలోని బల్లెములవలె నుండిన ప్రబలులగు రాజులను మన్నెరాజులను జయించి రాజ్యమును విస్తరింపఁజేసి నదీ సీతారామరాజుగారే.సులభముగ లొంగు పాటులోనికిరాని జమీందారులకు దమ చాకచక్యముచేఁ బట్టితెచ్చి విజయనగ రమునఁ గారాగృహబద్ధులుగఁ జేసెడివారు. ఇప్పుడీపట్టణమునఁ గోటకు నెదుటనున్న ‘బొంకులదిబ్బ.’ యను బయలు నాఁటి

" బంకూల్ "—అనఁగా—జైలుఖానా యుండిన స్థలమని యూహింపవచ్చును. బంకూల్ శబ్దవికారమే బొంకులయినది ఆకారాగారము శిథిలమైనతరువాత నాస్థలమును జనులు బంకూల్‌దిబ్బ యనెడివారు. అదియే రానురాను బొంకులదిబ్బయైనదని నిశ్చయముగా మనము చెప్పవచ్చును.

పూసపాటి వారికైఫీదు, డిస్ట్రిక్టమ్యాన్యూయల్, డిస్ట్రిక్టగెజటీయరు మొదలగు గ్రంథముల యందు నీయఁబడిన యానాఁటి వృత్తాంతమును జూచినపుడు సీతారామరాజుగారి క్రౌర్యము, నిరంకుశాధికారము మున్నగునవి వెల్లడియగును. కాని యప్పటి యవసరమును బట్టి, యాతఁడారీతిగఁ జేయవలసివచ్చెనని దృఢముగఁ జెప్పవచ్చును.

నూతనరాజ్య నిర్మాణమునఁ గలుగు కష్టములను న్యాయబుద్ధితో సరయఁ బ్రయత్నింపని వారలీ సీతారామరాజుగారి పరిపాలనా విధానములను నిందింపవచ్చును. ఇట్లునేఁజెప్పఁబూనినను సీతారామరాజుగారి యందెట్టి లోపములును లేవని చూప నేనుద్యమింపలేదు. సూరకవి బలవత్తరమగు నిందూషణగర్భకావ్యము (Satire) నిర్హేతుకముగ వ్రాసెనని నాయభిప్రాయమెంత మాత్రముగాదు. తగిన కారణములుండిన నుండవచ్చును. ఏది యెట్లున్నను నీశతకము పండితపామర జనరంజకమై యాంధ్రవాఙ్మయమునఁ గల శతకరాజములలో నుత్తమస్థానమధిష్ఠించి యున్నది. కవితాధోరణిని దెలుపఁ గొన్నిపద్యములిచటఁ బొందుపఱచు చున్నాఁడను.

సీ. మాన్యంబు లీయ స ♦ మర్థుఁ డొక్కఁడు లేఁడు
మాన్యము ల్చెఱుప సా ♦ మంతు లంద
ఱండినయాళ్ళ గో ♦ డెఱిఁగింపఁ డెవ్వఁడుఁ
బండినయాళ్ళెన్నఁ ♦ బాధ్యులంద
ఱితఁడు పేద యటంచు ♦ నెఱిఁగింపఁ డెవ్వఁడుఁ
గలవానిసిరి యెంచఁ ♦ గలరు చాలఁ
దనయాలి చీఁకటి ♦ తప్పెన్నఁ డెవ్వఁడుఁ
బెఱకాంతలంకెన్నఁ ♦ బెద్దలంద

తే. ఱిట్టిదుష్టుల కధికార ♦ మిచ్చినట్టి
రాజు ననవలెఁ గాక దు ♦ ర్నయుల ననఁగ
నేమి పని యున్న యది సత్క ♦ వీంద్రులకును
రామలింగేశ రామచం ♦ ద్రపురవాస.

సీ. పదుగురుఁ గోఁతివెం ♦ బడి సంచరింపరే
వాహకు ల్లేరె శ ♦ వంబునకును
గంగిరెద్దుకు లేవె ♦ ఘనతూర్యరావముల్
కలిమి గల్గదె వార ♦ కామినులకుఁ
బులి గోవుఁ జంపిన ♦ క్కటలను బోషింపదే
స్థూలకాయము లేదె ♦ దున్నలకును
నుప్పిపుంటికి లేదె ♦ పుట్టంబుఁ జుట్టుట
వేఁబుధరుం డెద్దు ♦ వెంట రాదె

తే. న్యాయసంస్థితి నడువని ♦ యవనిపతికి
నెన్ని చిన్నెలు గలిగిన ♦ నెందుకొఱకు
నంత్యమునఁ జూడ నలయు నా ♦ యయ్యసుఖము
రామలింగేశ రామచం ♦ ద్రపురవాస.

సీ. భయ మేల కొండంత ♦ పగతుఁడు నాకున్న
మేరువు వంచిన ♦ మేటి గలుగ
నాకేల శోకసం ♦ తాపంబునను గుంద
శీతాంశుమౌళి నా ♦ చెంత నిలువఁ
దస్కరభీతికిఁ ♦ దల్లడిల్లఁగ నేల
ప్రమథులతో శూల ♦ పాణినిలువ
నగ్నిభీతికి నాకు ♦ నళుకుఁజెందఁగ నేల
గంగాధరుండు నా ♦ కడ వసింప
తే. ననుచు నెంతటి కెంతటి ♦ కలుకు లేక
నమ్మియుంటిని నీపాత్రిపు ♦ నామనమున
జాగరూకుఁడవై నన్ను ♦ సాఁకు మయ్య:
రామలింగేశ రామచం ♦ ద్రపురవాస.

— పరిసమాప్తి. —

ఇఁతదనుక సూరకవి గ్రంథముల నొక్కొక్కదానిని బ్రత్యేకముగఁ దీసికొని నాకుఁదోచిన విధమున విమర్శనముఁ గావించితిని. ఇఁక నొక్కయంశము చర్చింపవలసి యున్నది. తనకుఁ బూర్వులగు కవులనుసరించిన మార్గములనే యితఁడను సరించెనా లేక క్రొత్తత్రోవల నవలంబించెనా యన్నసంగతి పరిశీలింప వలసియున్నది. ప్రథమాంధ్ర కవియు వాగనుశాస నుఁడును నగు నన్నయభట్టు మహాభారతమున.

ఉ. "సారమతిం గవీంద్రులు ప్ర ♦ సన్నకథా కవితార్థయుక్తితో
నారసి మేలునా,నితరు ♦ లక్షరరమ్యత నాదరింప"........
అని వ్రాసియున్నాఁడు.

దీనినిబట్టి సారమతులగు కవీంద్రులు, అక్షర రమ్యతనా దరింపరని తేలుచున్నది. ఇంతియె గాక తాను "నానారుచిరార్థసూక్తినిధి" యని చెప్పుకొనియెను. కాఁబట్టి ప్రశంసనీయమగు కావ్యమునందుఁ బ్రసన్నమగు కథయు, ప్రసన్నమగు కవితయు, నర్థయుక్తియు నుండవలెనని యామహాకవి యభిప్రాయము. అంతియె గాని యాలంకారిక గ్రంథముల యందుఁజెప్పఁబడిన విశేషగుణముల నన్నింటిని బ్రధానముగఁ జెప్పలేదు. కవి బ్రహ్మయగు తిక్కన తన నిర్వచనోత్తర రామాయణమున

ఉ. భూరివివేకచిత్తులకుఁ ♦ బోలు నవం దలఁపన్ దళంబులన్
సౌరభ మిచ్చుగంధవహు ♦ చందమునం బ్రకటంబుచేసి యిం
పారెడుపల్కులం బడయ ♦ నప్పలుకు ల్సరిగుచ్చునట్లుగాఁ
జేరువ నేరఁగా వలయుఁ ♦ జేసిద నేఁ గృతి యన్నవారికిన్.

క. తెలుఁగుకవిత్వము చెప్పం
దలఁచినకవి యర్థమునకుఁ ♦ దగియుండెడు మా
టలు గొని వళులుం బ్రాసం
బులు నిలుపకయొగిని బులిమి ♦ పుచ్చుట చదురే.

యని వ్రాసియున్నాఁడు. ఇందువలన, శబ్దములను జక్కఁగఁగూర్చుటయు, యతిప్రాసముల కొరకర్థగౌరవమును జెఱుపకుండుటయు సత్కవీంద్ర మార్గమని తెలియుచున్నది. మఱియుఁదన కవిత్వము "సరసమధురవచోగుంభనసుప్రసాదసంబోధన గోచరబహువిధార్థ తాత్పర్యము" కలిగి యుండుమని కూడఁజెప్పియున్నాఁడు. దీనింబట్టి చూడ నక్షరరమ్యతయు, నర్థగౌరవమును సత్కవీంద్ర సమ్మతమనియే తేలుచున్నది. నన్నయకాలమున నక్షరరమ్యత కంతయాదరము లేక పోయినను దిక్కన

నాఁటికిఁ గొంతవఱకుఁ గలిగినదని యూహింపవచ్చును. మొత్తము మీఁద నాంధ్రమహాభారత కవులు శబ్దాలంకారములకు నంతగఁ బ్రాముఖ్యము నిచ్చి యుండలేదని వారి కవిత్వము వలన స్పష్టమగుచున్నది.

కొంతకాలమునకుఁ బిమ్మట నాంధ్రభాగవత కృతికర్త యగు బమ్మెర పోతనామాత్యుఁడు తన గ్రంథమును శబ్దాలంకారములను విరివిగా జొనిపి యట్టి కవితను సర్వజనాదరణీయముగఁ జేసినాఁడు. పిదపవచ్చిన యాంధ్రకవితా పితామహుఁడగు నల్లసాని పెద్దనామాత్యుఁడు తాను రచియించిన "సింహావలోకనమను" నుత్పలమాలిక యందుఁ గవిత్వరీతు లెట్లుండవలెనో చెప్పియున్నాఁడు. ఆపద్యమును బూర్తిగ నిచట నుదాహరింపనవకాశము లేక యందలి సారాంశమును జెప్పుచున్నాఁడను. కవిత్వము మెఱుఁగుగలిగి రుచికరమయి, మనస్సు నాకర్షించు శక్తిగలదియై, కిన్నరస్వరము వలె మనమును బరవశత్వమునొందించి వింతలగు కోర్కెలను బుట్టింపఁ దగినగమనముతో రసమును విరజల్లుచుండవలెను. ఇట్టి యాదర్శమును బెద్దనార్యుఁడు ప్రదర్శించినను, "పూతమెఱుంగులుఁ" అను నీ మాలికను జూచినప్పుడు శ్రీనాథునకు నర్థగౌరవముతో సమానముగు ప్రాధాన్యము నతఁడంగీకరించినట్లగపడును. అంతియె గాక యాతఁడు శబ్దవైచిత్రికిఁ బక్షపాతము చూపెనని కూడఁ దోఁచును.

పెద్దనామాత్యునకుఁ బిమ్మట బయలుదేఱిన శబ్దాప్రకర్షమునను నాంధ్రకవిత్వమున కొక విధమగు క్షీణదశ

పొడసూప మొదలుపెట్టెను. ఆసమయముననే సూరకవి గ్రంథరచన కారంభించెను. పెద్దనగారి యుత్పలమాలిక యందలి విషయముల నతఁడు చక్కఁగఁ బరిశీలించెనని మాకుటుంబమునందు నిలిచియున్న సూరకవిగారి నాఁటి తాళపత్ర గ్రంథములను బరీక్షించినఁ దెలియఁగలదు. నన్నయ తిక్కనాదుల కవిత్వమునం దాతనికిఁ గల గౌరవమత్యధికము. పెద్దనామాత్యుని శ్రావ్యతాపక్షపాత మతము నతఁడవలంబింపక నన్నయాదుల మార్గమునే ప్రశస్తమని యెన్నినట్టులు సూరకవిదియగు నీక్రిందిపద్యమువలన విశదమగుచున్నది.

సీ. యతి, యుక్తవా ◆ క్యానుగతి నంటవలయు వ
త్సంబు ధేనువువెంటఁ ◆ దవిలినట్లు
మెట్టుమీఁదను గాలు ◆ పెట్టఁగ దండ యం
దిచ్చినట్టులు ప్రాస ◆ మెనయవలయు
సానఁబట్టినమణి ◆ చందానఁబద మధ్య
నారీశుభంగి బం ◆ ధంబువలయు
దివి వెలుంగు మెఱుంగుఁ ◆ దీఁగెయట్లర్థంబు
తేటతెల్లంబుగాఁ ◆ దెలియవలయు
గీ. నలఁతి తొలపడ్డచంద్రమం ◆ డలమువలన
జలజలనురాలు నమృతంపు ◆ జాలులీల
రసము తులకింపవలె నట్టి ◆ రమ్యకవిత
రసికరసనారిరంసచేఁ ◆ బ్రబలకున్నె.

ఇట్టి యాదర్శమును దన ముందిడుకొని కవిత్వము చెప్పినవాఁడగుటచేత సూరకవి కవిత్వము సత్కవి సమాదరణీయమై

నది. కావ్యరచనా విషయమున నూతనమార్గమును జూపు రామలింగేశ శతకమును వ్రాసి నన్నికెక్కెను. పూర్వకవుల యెడలఁ దనకుఁగల గౌరవమును, తన బుద్ధి స్వాతంత్ర్యమును నితఁడు, కవిత్వమర్యాదల యందు, కార్యనిర్మాణము నందును వెల్లడించియున్నాఁడు. సూరకవి సమకాలికులచేఁ జెప్పఁబడినదిగా వాడుకలోనున్న యీక్రింది పద్యమును, నతనికి నాంధ్రసారస్వతమునఁగల యున్నతస్థానమును నిరూపించుటకుఁగా నుదాహరించి ధన్యవాదములం జేయుచు నీమహనీయుని పవిత్రచరిత్రమును నింతటితో ముగించుచున్నాఁడను.

ఉ. ఆధునికుల్ కవీంద్రులు స ♦ హస్రము లుందురుగాక నీవలెన్
మాధురిగల్గునేకవన ♦ మార్గము తిక్కనసోమయాజి శ్రీ
నాథుఁడు ముక్కుతిమ్మకవి ♦ నాఁడు ప్రసిద్ధులుగాకి టీవలన్
గాధితమయ్యె నీవలనఁ ♦ గాదె కవిత్వము సూరసత్కవీ.




COMPOSED BY V. JAGANNADHAM:—S. V. V. PRESS, VIZIANAGRAM.

